శ్రీ శాస్త్రిగారి రచనల కన్నిటికిని సర్వాధికారములు మాస్వాధీనములు. మానాటకముల నాడగోరువారు ముందుగా మా యనుమతినందవలయును.

ప్రకాశకులు

చంద్రికా ప్రెస్సున ముద్రితము,
చాకలపేట, మదరాసు
అగస్టు 1954.

# విజ్ఞప్తి.

శృంగారరసగుళిక యనం దగు శ్రీహర్షుని ప్రియదర్శికా నాటిక సూక్ష్మములో మోక్ష మన్నట్లు చిఱుతుకతనముతోనే రసవత్తరం బగుటంగాంచి దానిని ఆంధ్రులగు రసజ్ఞుల పరితోషార్థమయి ఆంధ్రంబున రచించినాఁడను.

మఱి యిందలి సంవిధానసౌభాగ్యము నేతన్మూలము లయిన బృహత్కథాకథాభాగముల నెఱుంగనివారికి సుగ్రహముగాదు గావున, వానిని ఇందుం బొందుపఱిచినాఁడను.

1910 వేదము - వేంకటరాయశాస్త్రి.

## మూలకవిప్రశంస.

ఈనాటికను, రత్నావళీనాగానందములను, ధావకుఁడు (భాసకుఁడొండె) అనుకవి రచించి తన కాశ్రయుఁడైన శ్రీహర్ష మహారాజు రచించినట్లు ప్రకటించినాఁడని ఆభాణకము కలదు.

ఈ ధావకుఁడు ఇరువదింటి కెక్కుడు నాటకములు రచించినట్లును అందు కరుణరసప్రధాన మైనది కిరణావళి యను పేరిటిది ఒకటి యుండెననియు రాజశేఖరకవికృత గ్రంథము వలనం దెలియ నగుచున్నవి.

ఈధావకుఁడు చాకలి యనియు, ఘటకర్పరశబ్దఘటిత మైన యొకానొక చిన్ని కావ్యమును రచించినకతంబున నితనికి ఘటకర్పరుఁ డనినామాంతరము గలిగెననియు,

> " ధన్వన్తరి క్షపణ కామరసింహ శఙ్కు
> బేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
> ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
> రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య."

అని పరిగణితు లయిన విక్రమార్కునవరత్నములలో నొకఁ డనియును కొందఱు చెప్పుదురు.

మఱియు పూర్వోక్త శ్రీహర్షుఁడు క్రీస్తుశకమునకుముందు (ర్౭-వ సంవత్సరము నుండి) శకప్రవర్తకుఁ డయిన యుజ్జయినీ పతి శ్రీవిక్రమాదిత్యుఁడే యనియు, ఆయనకు శ్రీహర్షుఁ డని నామాంతర మనియు కొందఱును, క్రీ. శ. ఏడవశతాబ్దమున కన్యాకుబ్జము నేలిన హర్షవర్ధనుఁ డని యొకకొందఱును, వీ రిరువురుం గా రనియు తానేశ్వరాధీశ్వరుఁ డైన శ్రీహర్షుఁ డని మఱికొందఱును అభిప్రాయపడియున్నారు.

---

## వత్సరాజు పూర్వచరిత్రము. (కథాసరిత్సాగరము.)

తొల్లి ఉదయనుఁ డను రాజు పాండవవంశ్యుఁడు వత్స దేశమును కౌశాంబీనగరము రాజధానిగా నేలుచుండెను. అతఁడు బాల్యమునందు వాసుకియన్నను వసునేమి యను నాగుని ఒక పాములవానిచేతినుండి విడిపింపఁగా నాగుఁ డాకృతజ్ఞతచేత నత నికి ఘోషవతి యను నొక యద్భుతవీణ నిచ్చెను. దానివాద నముచేతను తనపాటచేతను వత్సరాజు అడవిలో గొప్పగొప్ప యేనుఁగులను ఎలయించి కట్టి తెచ్చుచుండెను.

ఉజ్జయినీపతి మహాసేనుఁడు చండికను గూర్చి తా నొనర్చిన చండోపాసనచే ఆమెవలన చండమహాసేననామమును పొందిన వాఁడు అంగారకాసురునిసుతను అంగారవతిని పరిణయమై ఆమె వలన గోపాలకుఁడు పాలకుఁడు నని యిరువురుపుత్త్రులను వాస వునివరమువలన అసమానలావణ్యను వాసవదత్త యను కూఁతునుం బడసెను. ఆమెకు పెండ్లియీడు రాఁగా చండమహా సేనుఁడు, ఆమెకు తగినవరుఁడు తన శాశ్వతవైరి యయినవత్స రాజు దక్క వే ఱొకఁడు లేమి నెఱింగి, మెలపున నతని వశ పఱుచుకొనువాఁడై, వత్సరాజును తనయింటికి వచ్చి తనకూఁతు నకు గాంధర్వవిద్య నేర్పవలయు నని దూతముఖముగా నడి గెను. మంత్రులబోధనచేత వత్సరాజు తనకడకే శిష్యనుగా కూఁతును పంపవచ్చు నని చండమహాసేనునికి ప్రతిసందేశము పంపెను.

అంతట చండమహాసేనుఁడు వత్సేశునిగజగ్రహణవ్యసన మెఱిఁగి యతనిం బట్టుకొన సాటిలేనిజంత్రపుటేనుఁగును చేయించి దానికడుపులో వీరపురుషులను దాఁచియుంచి వింధ్యా రణ్యములో నిలిపించెను. వేఁటగాండ్రవలన ఆయేనుఁగునఁగూర్చి విని వత్సరాజు దానిం బట్టువాఁడై తరలి అది బెదరు నని దండును దూరమున నిలిపి ఒంటిగా దరిసి దాని నెలయింప ఘోషవతిని వాయించుచు సంగీతముచేసెను. అదియు వాస్తవగజము వోలె చేష్టించుచు గీతాఽఽకృష్టమువోలె దరియుచు, యదృచ్ఛ చేతనుంబోలె నెడయుచు, అతని నేకాకిని గహనమున కెలయించెను. అంతట దానికడుపునుండి తలుపులు తెఱచుకొని వీర పురుషులు దుమికి అతనిం బట్టి యుజ్జయినికిం గొనిపోయిరి. చండ మహాసేనుఁడు ఎదురువచ్చి సత్కరించి సంకెలల వైచియు 'ఓ ప్రభూ, ఈమెకు సంగీతము నేర్పుము, పిమ్మట నీకు కల్యాణ మగును, చిత్తమందు ఆయాసపడకుము,' అని చెప్పి, వాసవ దత్తను శిష్యగా నప్పగించెను. ఈప్రసక్తిచే వాసవదత్త వత్సే శుని వలచి యతనికై యేసాహస మేనియుం జేయ సిద్ధపడి యుండెను.

ఇంతలో వత్సేశునిమహామంత్రి యౌగంధరాయణుఁడు రాజ్యము రుమణ్వదాదుల కప్పగించి వచ్చి, తనయోగవిద్యా ప్రభావముచేత తనకును వసంతకునికిని మాఱురూపులు గావించి కొని, ఉజ్జయినిం జొచ్చి, ప్రభువునకు వినోదార్థమై వసంతకుని

కత్సన్నిధికింబంపెను. అనంతరము తాను వలసిన యేర్పాట్లు గావించి యాతని నిట్లు హెచ్చరించెను:—'రాజా, నిన్ను చండ మహాసేనుఁడు మాయచేత పట్టి తెచ్చినాఁడు;నిన్నితఁడు కొమా పెత నిచ్చి సన్మానించి విడిపింపఁ దలఁచి యున్నాఁడు; కనుక ఇతని కొమారితను మనము స్వయముగా హరించి కొనిపోవుదము. ఇందువలన నితనిగర్వమునకు తగినప్రాయశ్చిత్త మగును. మనకు పౌరుషము లే దనులాఘువము కలుగకుండును. ఇతఁడు కొమారి తకు భద్రవతి యను నొక యేనుఁగును ఇచ్చియున్నాఁడు. దాని వేగమును పట్టుసామర్థ్యము నడగిరికి తప్ప మఱి యే యేనుఁగు నకును లేదు. దానిని చూచినయెడల నడగిరి దానితో యుద్ధము చేయనే చేయదు. దానిమావటీని ఆషాఢకుఁ డనువానిని నేను విస్తారముధన మిచ్చి స్వాధీనపఱుచుకొని యున్నాను. కావున వాసవదత్తాసమేతుఁడవై సాయుధుఁడవై ఆ యేనుఁగు నెక్కి రాత్రి రహస్యముగా వెడలిపోవలసినది.' ఇట్లు చెప్పి యౌగంధ రాయణుఁడు వెడలిపోయెను.

అనంతరము వత్సరాజు ఆపన్నాగమును వాసవదత్త కెఱుకపఱిచెను. ఆమె యాషాఢకునిం బ్రయాణసన్నాహమున కాజ్ఞచేసెను. ఆ రాత్రి ఆషాఢకుఁడు భద్రవతిని సన్నాహముచేసి తెచ్చెను. వత్సరాజు యౌగంధరాయణోపదిష్టయోగములచే సంకెలలూడ్చుకొని ఘోషవతిం గైకొని, తానును వసంతకుఁడును వాసవదత్తయు ఆమెనెచ్చెలి కాంచనమాలయు ఆషాఢకుఁ డై దవవాఁడుగా ఆమత్తహస్తిని నెక్కి, అదియప్పుడు ప్రాకా

మును పగులఁగొట్టి చేసినదారిగుండ వెలువడి పహరావీరులను సంహరించి వేగముగాపయనము సాగించెను.

అంతట పట్టణమెల్ల గందరగోళపడఁగా వృత్తాంత మెఱిఁగి పాలకుఁడు నడగిరి నెక్కి వీరిని వెంటఁ దఱిమెను. వత్సరాజు వానిపై అంపవాన గురియించెను. భద్రవతిని నడగిరి కొట్ట దాయెను. ఇంతలో గోపాలకుఁడు వచ్చి తమ్ముని యుద్ధమునుండి నివారించి తోడ్కొనిపోయెను. అనంతరము వత్సరాజు నిరాతంకముగా పయనము సాగించి వింధ్యారణ్యములో తనమిత్రుఁడు పుళిందకుని పల్లియలో విశ్రమించి క్రమక్రమముగా కౌశాంబిం జేరి అచటివారికెల్ల నేత్రోత్సవము గావించెను. అనంతరము గోపాలకాదులు వచ్చి వత్సరాజునకు వాసవదత్త నిచ్చి యథావిధిగా వివాహమహోత్సవము జరిపిరి.

ఈనాటికలోనికథ బృహత్కథయందలి (కథాసరిత్సాగరమునందలి) బంధుమతీ చరిత్రముపోలికను కల్పింపఁబడినది. ఆచరిత్ర యెట్లన:—

## బంధుమతి కథ.

ఒకప్పుడు గోపాలకుఁడు తాను బాహుపరాక్రమముచే పట్టితెచ్చిన బంధుమతి యనునొక రాజకన్యను వాసవదత్తకు కానుక పంపెను. ఆమెను వాసవదత్త మంజులిక యని మాఱు పేరు పెట్టి దాఁచియుంచెను. రాజు ఒకనాఁడు బంధుమతిని చూచి వసంతకుని సాహాయ్యముచేత ఏకాంతముగా ఉద్యానవనములో

నొక పొదరింట లావణ్యసముద్రములోనుండి యుద్భవించిన యపరశ్రీనింబోలె గాంధర్వవిధిచేత వివాహమాడెను. దానిని చాటునుండి చూచి కోపగించి వాసవదత్త వసంతకుని చెఱ నుంపించెను. వత్సరాజు ఆమె పుట్టినింటినుండి వచ్చియున్న యొక పరివ్రాజికను సాంకృత్యాయని యనునామెను శరణుఁజొచ్చెను. ఆమెమాటలచేత అలుకతీఱి వాసవదత్త బంధుమతిని భర్తకిచ్చి వసంతకుని చెఱ విడిపించెను. పతివ్రతల మనస్సు మృదువుగదా.

ఈ బంధుమతీ గోపాలక మంజులికా లతాగృహములకు బదులు నాటికలో ప్రియదర్శికా విజయసేనారణ్యికా దీర్ఘికలు. కడమవిషయమెల్ల రెంటనుం గలదు.

—

# నాటకపాత్రములు.

---

## పురుషులు.

సూత్రధారుఁడు.

| | |
|---|---|
| వినయవసువు. | ... ... అంగరాజుకంచుకి. |
| ఉదయనుఁడు. | ... ...వత్సరాజు, కథానాయకుఁడు. |
| వసంతకుఁడు | ... ... విదూషకుఁడు. |
| రుమణ్వంతుఁడు. | ... ... ఉదయనుని యమాత్యుఁడు. |
| విజయసేనుఁడు. | ... ... ,, సేనానాయకుఁడు. |

చండమహాసేనునికంచుకి.

## స్త్రీలు.

| | |
|---|---|
| యశోధర. | .... ... ప్రతీహారి. |
| వాసవదత్త. | ... ... ఉదయనుని పట్టపుదేవి. |
| ఆరణ్యిక (=ప్రియదర్శిక). | ... అంగరాజుకూఁతురు, (కథానాయిక.) |
| ఇందీవరిక. | ... ... చేటి. |
| మనోరమ. | ... ... ,, |
| కాంచనమాల. | ... ... ,, |
| సాంకృత్యాయని. | ... ... పరివ్రాజిక. |

శ్రీ

# ప్రియదర్శిక.

## నాన్ది.

సీ. కనుఁదమ్మి పొగ గ్రమ్మి కలఁగిన యంతనే
జాబిల్లి వెల్గున సంతసిల్లి,
వరునిపైఁ గ్రేగన్నుఁ బైచిన యంతనే
నలువచూడ్కులు దాఁక నానఁ జెంది,
అడుగుగోరను నీడ యగపడ్డయంతనే
యీశుపై గంగకై యీసు వొంది,
హరునికరస్పర్శ యలమినయంతనే
మైనిండఁ బులకలమలుపు దాల్చి,
తే. పరిణయమహోత్సవంబునఁ బ్రమదలీల
రాజిలుచునున్న శ్రీశైలరాజతనయ
మముఁ గరుణ జాలుకొనుకటాక్షముల నేలి,
మంగళ మొసంగుఁగాత సామాజికులకు.

మఱియును;

సీ. కైలాస శైల మాకసమున కెగయఁగా
బూచులు తూలి యబ్బురపడంగ,

ఆఱు మొగంబులయర్భకుండు బెఱీసఁ
దల్లి యొడిం జొచ్చి దాఁగికొనఁగ,
ఫణికులస్వామి కోపంబు దీపింపఁగాఁ
జుఱచుఱ దెసదెసఁ జూచుచుండ,
బొట్టవ్రేలను బిట్టు మెట్టఁగా మొఱు క్రుస్సి
పాతాళమునకు రావణుఁడు క్రుంగ,
తే. కోపఘూర్ణితుఁ డయ్యును గొత్తుగాఁగ
నివ్వెఱను గౌరి కౌఁగిటఁ గవ్వుకొనఁగ,
హర్షపారాన్నిధిని నోలలాడుచున్న
శివుఁడు మీ కిష్టసిద్ధులు సేయుఁగాత. ౩

---

# ప్ర స్తా వ న.



నాందికడపట సూత్రధారుఁడు (ప్రవేశించి)—నేఁడు వసంతోత్సవములో నానాదిగ్దేశాగతులు శ్రీహర్ష మహారాజ పాదపద్మోపజీవులు ధరణీనాయకులు సభ తీరి నన్ను పిలిపించి సగౌరవముగా ఆనతిచ్చినారు:—ఎట్లన- 'మాయేలినవారు శ్రీహర్ష మహారాజుగారు నూతనకథారచనతో నలంకరించి ప్రియదర్శిక యనుపేర నాటికను చేసియున్నారని కర్ణపరంపరగా విన్నారము గాని ఆడఁగాఁ జూడ మైతిమి; కావున సకలజనులకు హృదయానందకరులగు మహారాజుగారిమీఁది గౌరవముచేతను మామీఁది యనుగ్రహముచేతను ఆనాటికను చక్కఁగా నీవు ఆడింపవలసినది.' అని. కావున వేషధారణము చేసి వీరికోరికను నెఱవేర్చెదను. (అని అంతటం గాంచి) అహో! అప్పుడే సభా సదులహృదయములు వశీకరింపఁబడిన వని నాకు నిశ్చయము. ఏల యన? •

శా. శ్రీహర్షుండు కృతిప్రణేత, సభయుఁ
జేరె న్గుణగ్రాహి, యిం
తో హృద్యం బగు వత్సరాజుకథ, మా
కో సాటి లే రాటలో;

ఈహాసిద్ధి నొసంగు నొక్కఁ డొకఁడే
యిం, డేమిభాగ్యంబొ నేఁ!
డాహా! సర్వగుణంబులుం గలిగె నా
కానందరాజ్యంబుగాఁ! 3

(తెరవంక చూచి) ఆహా? నేను ప్రస్తావనకై కడంగఁగానే నాతలంపు నెఱింగినవాఁడై, అంగదేశాధీశ్వరుఁడగు దృఢవర్మయొక్క కంచుకియొక్క వేషమును దాల్చి మాయన్న ఇటకే వచ్చుచున్నాఁడు! కావున నేనును తరువాతివేషమును దాల్చెదను.

[అని నిష్క్రమించును.

ప్రస్తావన ముగిసినది.

---

## శుద్ధవిష్కంభము.

అంతట కంచుకి ప్రవేశించును.

కంచు.—(దుఃఖముతోడి యలయిక నభినయించుచు నిశ్వసించి) కటకటా!

ఉ. అన్నరనాథునాపదయు,
నాత్మజనంబులఁ బొయుదుఃఖముఁ,
ఉన్నయెడం దలంగుటయు,
నుగ్రకుమార్గగతిప్రయాసముఁ,
ఎన్నఁడు నేఫలం బిడని
యీచిరజీవిత నాకు నేఁటికిఁ
గన్నవిసంపుఁబం డిది తి
నన్వలసెఁ ! విధి వ్రాలు తప్పునే ! ౪

(దుఃఖాశ్చర్యములతో) ఔరౌర! అంతటివానికి శక్తిత్రయములో ఎదురులేని వానికి రఘు దిలీప నహుషులతో సమానునికి, దృఢవర్మకు, - ఆ పాడుకళింగుఁడు తాను అడుగుచున్నను ఈయన తన కూఁతును వత్సరాజునకు వాగ్దానము చేసినాఁడు అని పగపట్టినవాఁడై, వత్సరాజు గట్టిచెఱలో నున్నాఁడని సందు పొందినవాఁడై, ఇట్టియాపదను చేయు నని జరిగిన విషయము నైనను నమ్మఁజాలకున్నాను. ఏమి! దైవము ఈవిధముగా మావిషయమై కేవలము క్రూర మయినది! ఏల యన.

ఆ రాజపుత్త్రిని 'ఎట్లో ఒక యట్లు ఈ మెను వత్సరాజునకు అర్పించి నా దొరను దృఢవర్మను ఋణవిముక్తుని చేయుదును గాక' యని నేను ప్రళయకాలఘోరమైన యామ్ముట్టడిగందరగోళమునుండి యు తప్పించి తెచ్చినవాఁడ నై, దృఢవర్మనరపతికి మిత్త్రుఁ డగుటచే అడవిదొర వింధ్యకేతునియింటను ఉంచి, స్నానమునకు అతిదూరముగామిచేత అగస్త్యతీర్థమునకుపోయి యుండఁగా క్షణములో ఎవరో వచ్చి పల్లెమీఁదఁబడి వింధ్యకేతుని చంపి రక్కసులువలె చోటిని నిర్జనము సేసి కాల్చివైచిరి. ఆ రాజ పుత్త్రి ఏయవస్థలో నున్నదో తెలియకున్నది. చక్కఁగానే వెదకితిని ఈ చోటెల్లను. ఆశత్రువులే కొనిపోయిరో, ఇట కాలిపోయినదో, తెలియదాయెను. కావున ఏమి సేయుదును ! అల్పపుణ్యుఁడను! (ఆలోచించి) ఆహా! వింటిని 'చెఱనుండి వెలువడినవాఁడై ప్రద్యోతుని కౌమారితను అపహరించి వత్సరాజు కౌశాంబికి వచ్చె' నని. అచటికే పోదునా? (నిట్టూర్పువుచ్చి తనయవస్థను చూచు కొనుచు) అహాహా! రాజపుత్త్రిని తోడ్కొనక అచటికి పోయి ఏమిచెప్పుదును! ఆహా! చెప్పినాఁడు నేఁడు వింధ్యకేతుఁడు 'పూజ్యుఁడు దృఢవర్మ బ్రదికియున్నాఁడు, గాటపు దెబ్బలకు ఒడలు శిథిలమై యున్నాఁడు.' అని. కావున ఇప్పుడు నా యేలిన వారికడకే పోయి వారి పాదసేవచేత నాయాయుశ్శేషమును సఫలీకరించెదను. (నడచి మీఁదు చూచి) అహో! శరత్కాలపు టెండ ఎంత తీక్ష్ణముగా నున్నది. ఎట్లన; ఇవ్విధమున నానాశోక ములచే క్రాఁగుచున్ననాకును కడువేండ్రముగా తెలియనగు చున్నది.

తే. తలఁగి ఘనబంధనంబును దరణి యిట్టఁడు
కన్నెను గ్రహించి పయితుల౦ జెన్నువిూఱి
ఆత్మధామంబు వెండియు నధిగమించి
తేజరిల్లెడుఁ గడు వత్సరాజుపగిది. ౫

[అని నిష్క్రమించును.

శుద్ధవిష్కంభము ముగిసినది.

---

# ప్రథమాంకము

---

(అంత రాజును విదూషకుఁడును ప్రవేశింతురు.)

రాజు —

ఉ. సేవకభక్తియున్ సచివ
సింహుల ప్రజ్ఞయుఁ దెల్ల మయ్యె, మి
త్త్రావళి తేట యయ్యె, విది
తం బధికంబు ప్రజానురాగమున్,
సేవిత యాజిసాహసిత,
చేపడియెన్ దరుణీలలామ; నా
కేవిభవంబు నీనిగళ
మాయ దదాంభికధర్మకల్పమై? ఉ

విదూ.—(కోపముతో) మిత్త్రమా, ఏమి వాణ్ణే లంజె కొడుకును పాడుచెలును పొగడుతున్నావు! దాన్ని ఇప్పుడు మరిచినావా! దేన్నంటే— క్రొత్తగా పట్టిన పరికానిలాగు ఖలఖలమని మొరుగుతున్న యినపసంకెళ్ల చేత పాదాలు తొట్రిల్లుతుండగా మనోభావం ఏమాత్రమూ తెలియరాని మోముదమ్మి మనస్సులోవున్న దుఃఖాన్ని తెలుపుతుండగా, బలేకోపంచేత నిలుపుచూపుపడి పట్టినేలమీద పరుండి రాత్రులు సమేతూ నిద్రాసుఖాన్ని పొందవే! దాన్ని ఇప్పుడు మరిచి నావా? అంటూ.

రాజు.—వసంతకుఁడా, దుర్జనుఁడవు సుమా నీవు; చూడుము:

సీ. చిమ్మచీఁకటి గ్రమ్ముచెఱను జెప్పెదు గాని
యాముఖేందుజ్యోత్స్న నరయ వేమి?
సంకెలరవళికిఁ గింకఁ జెందెదు గాని
యామధురాలాప మరయ వేమి?
కూళలఁ జెఱరక్షకులఁ దలంతువు గాని
యానెయ్యపుఁ గటాక్ష మరయ వేమి?
స్వాతంత్ర్య ముడిపినసటల నెంచెదు గాని
యాచెలిసంగాత మరయ వేమి?
తే. దోసములె? బంధనంబున వాసి లేదె?
మనమునను జక్కఁ దలపోయుమా వయస్య,
ఏది చండమహాసేన మేదినీంద్రు
పుత్త్రికామణిగుణగణంబునకు సాటి? ౭.

విదూ.—(గర్వముతో) సంకెళ్లతో కట్టడం సుఖంతో కట్టడం అయ్యేటపక్షాన, ఏల నీవు దృఢవర్మను సంకిళ్లు వేశాడని కళింగరాజుమీఁద కోపం చేస్తావు?

రాజు.—(నవ్వి) ఛి! మూర్ఖుఁడా! ప్రతివాఁడును ఇవ్విధమున వాసవదత్తను పొంది చెఱనుండి వెలువడునట్టి వత్సరాజు గాఁడు. మఱి ఈకథ యటుండుఁగాక. వింధ్యకేతునిమీఁదికి బహుదినములు అయినవి విజయసేనుని పంపి; మఱి ఆవిజయసేనుని కడనుండి ఇప్పటికిని ఎవ్వఁడును రాలేదు. కనుక మంత్రిని రుమ

ణ్వంతుని పిలువుము, అతనితో కొంచెము సంభాషింపఁ గోరియున్నాను.

ద్వారపాలిక.—(ప్రవేశించి) జయం జయం ఏలినవారికి. వీరుగో విజయసేనుడున్ను మంత్రి రుమణ్వంతుడున్ను ద్వారంలో వచ్చియున్నారు.

రాజు.—త్వరగా ప్రవేశపెట్టుము.

ప్రతీ.—ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

రుమణ్వంతుడు.— (ఆలోచించి)

తే. అప్పుడే వెల్వడినవార లయ్యు వెండి
యువనినాథునిప్రాలకు నరుగువేళఁ
దప్పు లేకయె భృత్యులు తలుచుగాఁగఁ
ద ప్పొనర్చినచందానఁ దల్లడింత్రు. రా

(సమీపించి) జయము ఏలినవారికి.

రాజు.—(ఆసనము చూపి) రుమణ్వంతుఁడా, ఇటఁ గూర్చుండుము.

రుమ.—(చిఱునగవుతో కూర్చుండి) వీఁడుగో వింధ్యకేతుని జయించినవాఁడు విజయసేనుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

[విజయసేనుఁడు అట్లు సేయును.

రాజు.—(ప్రీతితో కవుంగిలించి) సేమమా నీకు ?

విజ.—ఇప్పుడు, ఏలినవారి యనుగ్రహమువలన.

రాజు.—విజయసేనుఁడా, కూర్చుండుము.

[విజ.—కూర్చుండును.

రాజు.—విజయసేనుఁడా, ఏమి వింధ్యకేతుని వృత్తాంతము ?

విజ.—దేవా, వేఱే ఏమి చెప్పఁగలను! ఏలినవారు కోపగించిన నేదో అదే.

రాజు.—అట్లయినను సవిస్తరముగా వినఁ గోరుచున్నాను.

విజ.—దేవరా, వినుము. ఇటనుండి మేము ఏలినవారి పాదములయానచే మాకు నియోగింపఁబడిన గజాశ్వపదాతి సైన్యముతో కడుదూరము మూఁడు దినములలో నడచి వేగుతఱిని కేవలము ఆకస్మికముగా వింధ్యకేతునిమీఁద పడితిమి.

రాజు.—అంతట? అంతట?

విజ.—అంతట ఆవింధ్యకేతుఁడును మాకోలాహలము విని మేలుకొని, సింగము వోలె వింధ్యగుహనుండి వెలువడి, దండును గుఱ్ఱమును ఎదురుసూడక అప్పటికి తనతో నున్న కొంచెపాటి సహాయులతో తటాలున ఆకాశము మాఱుమ్రోఁగునట్లు సింహనాదములు సేయుచు మమ్ము తాఁక సమకట్టినాఁడు.

రాజు.—(రుమణ్వంతునిఁ గాంచి చిఱునగవుతో) తేజరిల్లినాఁడు వింధ్యకేతువు. అంతట ? అంతట ?

విజ.— అంతట మేము వీఁడే వీఁడే అని యినుమడిగా మత్సరోత్సాహంబులు పిచ్చలింప నురవడించి పోరి వాని సహాయుల నెల్ల రూపుమాపితిమి. అంత నతఁడు ఒక్కరుండే బల

మును క్రోధమును వేగంబును పెచ్చు పెరుఁగ అతిక్రూరముగా పోరినాఁడు.

రాజు.—బళీ! వింధ్యకేతూ! అంతట? అంతట?

విజ.—ఏమని వర్ణింతును! దేవరా, సంగ్రహముగా విన్నవించెదను:—

చ. తొలుఁతను త్రొమ్ముపోటులనె
దుర్మొనరించి పదాతులన్, శరా
వళు లడరించి లేళ్లవలె
వాజుల దిక్కుమొగంబు సేసి, యా
వలఁ బెఱకై దువు ల్విసరి
వైచి మహాసిని దూసి యేన్గులన్
స్రెలగఁ ద్రోడంగె నంటివనిఁ
జిందఱవందఱ సేయునాటగాన్.

తే. ఒక్కఁడె బలత్రయము నిట్టు లుక్కడంచి
కత్తినెత్తుట నెగుమాఁపు జొత్తిలంగ
వాలుగంటులు పేరెద వేలు గ్రాల
వీరుఁ డెప్పటికో దస్సి విహతుఁ డయ్యె. ౧౦

రాజు.—రుమణ్వంతుఁడా, సజ్జనవర్గమునకుఁ దగిన మార్గమునం జనిన వింధ్యకేతుని యీాయభావనీయమరణముచే మేము నిజముగా లజ్జితులము సుమా.

రుమ.—దేవా, మీాబోఁటి గుణైకపక్షపాతులు పగవానిగుణములందు సయితము అనురక్తినే వహింతురు.

రాజు.—విజయసేనుఁడా, వింధ్యకేతునికి సంతతి ఏ మేని కలదా, దానియందు ఈప్రీతికి ఫలమును చూపుటకు ?

విజ.—దేవరా, ఇదియు విన్నవించెద:—ఈవిధముగా బంధుపరిజనసమేతముగా వింధ్యకేతువు మడిసినంతట అతని ధర్మపత్నులు అతనితో సహగమనము చేసిరి. ప్రజలు వింధ్యశిఖరముల కెక్కి పలాయితులైరి. అట్లు పాడైనయాచోట 'అయ్యో! నాయనా! అయ్యో! అమ్మా!' అని దీనముగా విలపించుచు సుందరమూర్తియొకానొక కన్యక వింధ్యకేతునియింట నుండఁగా అతనికూఁతు రని తలఁచి మేము తెచ్చితిమి, ద్వారమందు ఉన్నది. ఆమెను గూర్చి యేలినవారిచిత్తము.

రాజు.—యశోధరా, పోయి నీవే ఆకన్యను వాసవదత్తకు అప్పగింపుము. అప్పగించి దేవితో చెప్పుము:—'చెల్లెలిని గాఁ దలఁచి నీవే ఎల్లప్పుడును చూచుకొనవలసినది. నృత్యగీతవాద్యాదులయందు ఉత్తమకన్యకలకు తగిన దెల్ల నేర్పింపవలసినది. ఎప్పుడు పెండ్లికి తగిన దగునో అప్పుడు మాకు జ్ఞప్తి సేయవలసినది.' అని.

ప్రతీ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

(నేపథ్యమున స్తుతిపాఠకుఁడు)

శా. లీలామంగళమజ్జనోపకరణా
 ళిం గూర్చి శుద్ధాంతవే
 శ్యాలోకం బిపుడాప్రయాసమున డ
 య్యెం, బయ్యెద ల్డూల, గా

రాలోకంబులఁ జన్గవల్ మెఱయుచుఁ
బ్రత్యక్షమౌశీవిమైఁ
గ్రాలుఁ మజ్జనశాల భర్మకలశౌ
ఘం బొండు తా నెత్తె నాఁ. ౧౧

రాజు.—(మీఁదఁగాంచి) అహో! ఏమి వేవెలుఁగుల వేలుపు మింటినడిమికివచ్చినాఁడు! ఇప్పుడు నిశ్చయముగా:—

క. మిడియెండ కుడుకుడిగ్గియ
బుడగలు నా ఖేడిస లవె పొరిఁబొరిఁ ద్రుళ్లఁ;
గొడుగుగఁ దాల్చు నటనచే
సడలినదానిని కలాపి చయ్యనఁ గుంచెఁ. ౧౨

తే. లేడి లేఁగ తరులగుం డ్రనీడఁ జేరుఁ
బాదులజలం బనుచు నాసపడి రయమున;
విడిచి యేనుఁగుచెక్కిలి వేగిరముగ
చెవితోఁటలోనఁ దుమ్మెద చేరు నిపుడు. ౧౩

రుమణ్వంతుఁడా, లేలెమ్ము, లోపలికే పోయి యథో చితక్రియ లొనర్చి విజయసేనుని సత్కరించి పంపుదము.

[అందఱు నిష్క్రమింతురు.

ప్రథమాంకము ముగిసినది.

# ద్వితీయాంకము

(అంతట విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ.—చెప్పింది గదా నాతో ఇందీవరిక, 'వసంతకుఁడా, నేడు వాసవదత్తాదేవి ఒక్కప్రొద్దున్నది. స్వస్తివాచనానికోసం నిన్ను పిలుస్తూ వున్నది' అని. కనక ధారాగృహోద్యానంలో డిగ్గియలో స్నానంచేసి దేవియొద్దికి వెళ్లి హుళిక్కిస్వస్తి పఠిస్తాను. ఆలాగు గాకపోతే, మావంటి బ్రాహ్మలకు రాచనగరిలో ప్రతిగ్రహమెక్కడిది! (తెరవంక చూచి) ఓహో! ఇదుగో ప్రియవయస్యుఁడు నేడు దేవిని యెడబాసినదుఃఖాన్ని మరవడానికి ధారాగృహోద్యానానికి తరలినాడు. కనక వయస్యునితో గూడానే వెళ్లి నేననుకొన్నట్లు చేస్తాను.

(అంతట రాజు తమకముతో ప్రవేశించును.)

రాజు.—

ఉ. సోలుచు, క్షీణయై నుడువ
సొక్కుచు, శోభనమాత్రభూషయై,
పాలినమోముఁదామరఁ బ్ర
భాతసుధాంశుసిరిన్ హరించుచున్,
దాలుచునొక్కప్రొద్దుకత
నన్ గర ముత్కలికన్ వహించుస్రో

యాలిని నూత్న రాగజద
శాంచితఁ బోలెఁ గనంగఁ గోరెదన్. ౧౪

విదూ.—(దరిసి) శుభం నీకు ; వర్ధిల్లు.

రాజు.—(చూచి) వసంతకా, ఏల యింత సంబరము?

విదూ.—పూజిస్తుంది గదా దేవి బ్రాహ్మణ్ని.

రాజు.—అటయిన నీ కేమి కలదు?

విదూ.—(గర్వముతో) ఓయి బ్రాహ్మడంటే ఎవడనుకున్నావు? నాలుగువేదాల ఐదువేదాల ఆఱువేదాల సహస్రవేదాలబ్రాహ్మలు వేన వేలు మూగివున్న రాచనగరిలో మొట్టమొదట, రాణీగారివల్ల ఎవడు స్వస్తివాచనం పుచ్చుకొంటాడో వాడూబ్రాహ్మడు.

రాజు.—(నవ్వి) వేదసంఖ్యచేతనే నీబ్రాహ్మణ్యము తెల్లమయినది. మఱి రమ్ము మహాబ్రాహ్మణుఁడా, ధారాగృహోద్యానమునకే పోవుదము.

విదూ.—నీ యాజ్ఞ.

రాజు.—ముందు నడువుము

విదూ.—మఱి రా పోదాం. (నడచి పరికించి) వయస్యుడా, చూడుచూడు ధారాగృహోద్యానపుసొంపును. ఇక్కడ తెంపులేక రాలుతున్న నానాజాతుల పువ్వులచేత రాతిబండలు ఎంతకోమలంగా వున్నవో! పూవుల తావికోసం తుమ్మెదలు గుంపుగుంపుగా మీదబడగా ఆబరువుకు పొగడలున్ను జాజితీగెలున్ను విరిగినవి! తామరతాపిని మిక్కటంగా మోసుకొని

వస్తూవున్న యీ గాలికి మంకెనమొగ్గలు వికసిస్తూవున్నవి! దట్టమైన యీచీకటిచెట్లు ఎండదీప్తిని చొరనీకున్నవి!

రాజు.—మిత్రమా చక్కఁగా చెప్పితివి. ఎట్లన నిచట:-

ఉ. రాలినవృంతజాలముల
రాజిలు వావిలిచెట్లక్రిందటన్
నేల తనుప్రవాళముల
నీటొదవన్ రచితం బొకో యనన్;
గాలికి సప్తపర్ణముల
గంధ మిదే మనచాయ వీచుచున్
బోలికఁ జూపు యూథప స
ముత్కట దానఝరంపుఁదావితోన్. ౧౫

మఱియు,

క. తుమ్మెదలు తమ్మిపుప్పొడిఁ
గమ్మఁబసిమిరెయొడలిపూఁతగాఁ దాల్చి, మరం
ద మ్మాని మత్తుగొని గీ
తమ్ములు పాడెడిని వ్యక్తతారిక్తముగాన్. ౧౬

విదూ.—వయస్యా, దీన్నికూడా బాగా చూడు, చూడు - ఎడతెంపులేక రాలుతున్న పువ్వులచేత ఈ యేడాకుల అరటి - వాన వెలిశిన వెంటనే నీటిబొట్లు పైయాకుల యంచులలోనుంచి రాలుతూవున్నట్లు శోభిస్తూవుంది.

రాజు.—చక్కఁగా కనిపట్టితివి వయస్యా. ఏల యన నిచట వానకారుతోడి పోలిక మెండుగానే యున్నది. అట్లే:

చ. అడర శిరీపుష్పమృదు
లామలశాదహారిత్రప్రదేశముల్
కడిగినపచ్చరాయిసుకఁ
గట్టిఁగ్రొన్నెలకట్లకై వడిన్,
తొడిమలనుండి జాఱి పడి
తొట్టినమంకెనపూవుతావులన్
బుడమి మహేంద్రగోపశత
పుంజితమో యన నొప్పు నిప్పుడున్. ౧౭

(అంతట చేటి ప్రవేశించును.)

చేటి.—దేవి వాసవదత్త ఆజ్ఞాపించింది:—'ఓసే ఇందీవరికా, నేడు నేను అగస్త్యమహామునికి అర్ఘ్యం ఇయ్యవలెను, గనుక నీవు వెళ్లి వావిలిపువ్వులు త్వరగా కోసుకురా' అని; 'ఈ యారణ్యికకూడా ధారాగృహోద్యానదీర్ఘికలోనుంచి తామరలను వాలుప్రొద్దుచేత ముణతలుపడక ముందే కోసుకొని రావలెను.' అని.—పాపము! ఆరణ్యిక ఆదిగ్గియ యెక్కడనో ఎరగదు. కనక దాన్నికూడా తీసుకొని వెళ్తాను. (నేపథ్యము వైపు చూచి) ఇలా రావే, ఆరణ్యికా, ఇలా రా.

(అంతట ఆరణ్యిక ప్రవేశించును.)

ఆరణ్యిక.—(కన్నీళ్లతో తనలో తాను) అలాగ అప్రసిద్ధవంశంలో పుట్టి చేటికలను పనిపుచ్చుకొంటూ వుండి, యిప్పుడు నేను ఒకరియాజ్ఞను చేయవలశినదాన్ని ఐతినిగదా! దైవానికి అసాధ్య మే మున్నది? అట్లుగాదు, నాదే యీతప్పితం; ఏలంటే

ఇటువంటిదశ కలుగుతుందని యెఱిగిన్ని నేను నాప్రాణాన్ని వదల నైతిని. అపని యిప్పుడు చేతునా? వద్దు, అట్లు చేయడం ఇప్పుడు సాధ్యం గాదు. అయినా నాగోప్పవంశాన్ని చెప్పుకొనే లాఘవానికి పాలు కా నయితిని, ఏమిగతి! పెట్టినపని చేస్తాను.

చేటి.—ఈలా రావే ఆరణ్యికా.

ఆర.—ఇదుగో వస్తున్నా. (శ్రమ మభినయించుచు) ఒసే దూరమా దిగుడుబావి?

చేటి.—ఇల్లిదుగో వావిలిగుబురుచాటున. రా మఱి దిగుదాం. [దిగుట నభినయింతురు.

రాజు.—వయస్యా, ఏమి వేత్తే ఏమో పరధ్యానముగా నున్నావు? చెప్పుచున్నాను గదా వర్షర్తువును మిక్కిలి పోలి యున్న దని.

[అడరశిరీష - ఇత్యాది మఱల పఠించును.

విదూ.—(కోపముతో) ఓహోయి నీవు మాత్రం ఇదీ అదీ చూస్తూ పట్టరాని నీ తమకం తీర్చుకొంటున్నావు. మఱి నాకు బాపడికి స్వస్తివాచనవేళ మిగిలిపోతూవున్నది. కనక నేను దిగుడుబావిలో స్నానంచేసి రాణీగారికాడికి పోతా.

రాజు.—మూర్ఖుఁడా, రానే వచ్చితివి డిగ్గియదరికి. ఇవ్విధమున అనేకేంద్రియ సుఖమును అనుభవించుచుండియు కనిపట్టవైతివి. అట్లే గదా; చూడు:—

క. వీనులకు విం దొనర్పఁ బ్రి
యానూపురరావహారి లగునంచరొదల్ ;

ఆనంద మిడుఁ గనులకుఁ ద
టానోకహవివరదృశ్య లగువీచితతుల్. ౧౮

క. గమ్మన వలచెడుదామర
సమ్ములనెత్తావి ఘ్రాణసమ్మద మొసఁగుఁ;
అమ్మయశీతమ్ములు వా
తమ్ములు గాత్రమ్ములకు ముద మ్మొదవించుఁ. ౧౯.

కనుక రమ్ము దిగ్గియకడకు పోవుదము. (నడచి, పరికించి) వయస్యా. చూడు:

తే. చూచినంతనె యెంతయుఁ జోద్య మొప్ప
స్వచ్ఛమును విస్ఫుటాంభోరుహాచ్ఛవియును
బ్రమదవనలక్ష్మిదీర్ఘ నేత్రం బనంగ
డిగ్గియ ముదం బొసంగు నాడెందమునకు. ౨౦

విదూ.—(కుతూహలముతో) వయస్యా, చూడు చూడు. ఎవతె మజి యీమె? పువ్వులచేత జడతుమ్మెదబారు పరిమళిస్తున్నది; పగడపు చిగుళ్లలాంటి ఎఱ్ఱనిచేతులతో సన్నని బుజాలు వెలుగుతున్నవి; వాస్తవంగా ప్రత్యక్షంగా వుద్యానదేవతే సంచరిస్తూ వున్న దనేలాగ అవుపడుతూవుంది.

రాజు.—(కుతూహలముతో కాంచి) వయస్యా, ఈ చెలువ సర్వోత్కృష్టకాంతిచే పెక్కుశంకలు గొల్పినది. ఔరా! ఎఱుఁగజాలకున్నాను. చూడు:

చ. బలియిలు వీడి భూమిఁ గనఁ
బన్నగకన్యక యేఁగుదెంచెనో?

కలుగదు దాన నిట్టిచెలి,
కంటిని నే నలలోకము౯ వృథా;
నెలవెలుఁ గిట్లు రూపు గొని
నిల్చెనొ? యుండ ద డెందునుం బవల్;
నలినముఁ గేలఁ దాల్చి సిరి
నాఁ దగునీలలితాంగి యెవ్వతో? ౨౧.

విదూ.—(పరికించి) ఇదుగో రాణీగారి పరిచారిక ఇందీవరిక వస్తూవుంది. గనక పొదచాటున ఉండి చూతాము.

[ఇరువురు నట్లు చేయుదురు.

చేటి.—(తామరాకుం గైకొనుట నభినయించుచు) ఆరణ్యకా, నీవు తామరలని కొయ్యి, నేనున్నూ ఈతామరాకులో వావిలిపువ్వులని కోశి పొట్లంగట్టుకొని దేవికాడికి వెళ్తాను.

రాజు.—వయస్య, సంభాషణవలె విన఼ఁబడుచున్నది, కనుక హెచ్చరికగా విందము. ఒకవేళ ఆసంభాషణవలననే ఈకన్య ఎవరో తెల్లముకాఁగలదు.

[చేటి పోవుట నభినయించును.

ఆర.—సకియా, ఇందీవరికా, నావల్ల గాదు నీవు లేక క్షణ మైనా ఇక్కడ ఉండడానికి.

చేటి.—నేఁడు నేను దేవి చెప్పగా విన్నమాటవల్ల, చాలాకాలమే నన్ను బాశి నీవు ఉండవలెను.

ఆర.—(ఖేదముతో) ఏమి చెప్పింది దేవి.?

చేటి.—"అప్పుడు నాతో ఆర్యపుత్త్రుడు అనతిచ్చినాడు గదా 'ఈవింధ్యకేతునికూతురు ఎప్పుడు పెళ్లికి తగిన దవుతుందో అప్పుడు తనకు గ్స్తిచేయవలిశింది.' అని. కనుక ఇపుడు ఆర్యపుత్త్రునికి గ్స్తిచేస్తాను, ఆయన దీనికి వరుణ్ణి వెదకడానికి పూనుకొంటాడు." అన్నది.

రాజు.—(హర్షముతో) ఈ కుమారి ఆవింధ్యకేతుని కన్య! (వగపుతో) చిరకాలము మోసపోయితిమి మేము. వయస్యా, కన్యకలం జూచుటయందు దోషము లేదు; నిశ్చింతగా తిలకింతము.

ఆర.—(రోషముతో) అటయితే పో నీవు. తప్పుడు మాట లాడుతున్నావు, నీతో నాకు పని లేదు.

[చేటి అవలి కేఁగి పూవులు గోయుట నభినయించును.

రాజు.—అహాహా! ఈధీరతచే గొప్పయింటిపుట్టుక మిక్కిలి తెల్లమయినది! వయస్యా, ఈరమణినెమ్మేనిం దాఁకెడు సుఖమున కెవఁడు పాత్ర మగునో వాఁడు గదా ధన్యుఁడు.

[ఆర. తామరలఁ గోయుట నభినయించును.

విదూ.—వయస్యా, చూడు చూడు, ఆశ్చర్య మాశ్చర్యం! విలాసంగా ఈమె కదిలిస్తున్న కేలుజిగురు కాంతి కమ్మడం చేత ఈమె కోస్తున్న కమలము వెలవెలబోతూవుంది!

రాజు.—అది ఏపాటివింత ? (వాస్తవమయినవింత యిదిగో) చూడు చూడు.

మ. అమృతాహారిణి నాఁగఁ గన్నులకు నా
    హ్లాదంబు గావించుచున్,
సమయంబందుఁ బయోధరాంశుకము స్ర
    స్తం బౌట దృక్పర్వమై,
హిమధామాకృతి యైనయీరమణిచే
    హేలాగృహీతంబు లీ
కమలంబు ల్ముకుళింపకున్నవి! యదే
    కన్పట్టుఁ జోద్యంబుగాన్. ౨౨

ఆర.—(తుమ్మెదలవలనిబాధను అభినయించుచు) అయ్యయ్యో! ఇవి వేజే పాడు తుమ్మెదలు తామరలకలువల తంపరలనువదిలి వచ్చి మీఁదబడి నన్ను మరీ యింత బాధిస్తూ వున్నవి. (భయముతో) ఒసే ఇందీవరికా, కావు నన్ను ఈ పాడుతుమ్మెదలు బాధిస్తున్నవి.

[అని పయ్యెదను ముఖమునకు కప్పుకొనును.

విదూ.—వయస్యా, నీకోరికలు కొనసాగినవి. ఈయిందీవరిక రాకముందే నీవు మాటలాడక సమీపించు. నీటి చప్పుడువల్ల కాలినడక నూహించి ఆమె ఇందీవరికే వస్తూవుం దని అనుకొని స్వయంగానే నిన్ను పట్టుకొంటుంది.

రాజు.—బళి! మిత్త్రమా, బళి! సమయోచితముగా నుపదేశించితివి.

[అని ఆరణ్యిక చెంతకు నడచును.

ఆర.—(అడుగులచప్పుడు వినుట నభినయించుచు) ఇందీవరికా, త్వరగా రావే. పాడుతుమ్మెదలు నన్ను చీకాకుపెడుతున్నవి.

[అని రాజును పట్టుకొనును. రాజు మెడను కవ్వఁగిలించుకొనును. మొగముమీఁది యుత్తరీయమును తీసి రాజును చూడక తుమ్మెదలను చూచుట నభినయించును.]

రాజు.—(తనయుత్తరీయముతో తుమ్మెదలను తోలుచు)

తే. విసువకుము గోల, యీతేంట్లు ముసురుకొనియెఁ
దావికై నీదునెమ్మోముఁ దమ్మిమీఁద ;
వెండి వెదచల్లెదేని నీబెదరుఁజూపుఁ
గలువతంపరసిరి, నవి తలఁగు నెట్లు ! ౨3

ఆర.—(భయ మభినయించుచు) ఏమి ! ఇందీవరిక కాదే! (భయపడుచు రాజును వీడి ఆవలికి జరుగుచు) ఇందీవరికా, త్వరగా రావే రావే; కాపాడవే.

విదూ.—అమ్మా, సకలలోకాన్ని కాపాడే సమర్థుడు వత్సరాజు నిన్ను కాపాడుతుండగా, ఏల చేటిని పిలిచేవు ?

[రాజు 'విసువకుముగోల' మొ. మరల పఠించును.

ఆర.—(రాజును గాంచి తమకముతో సిగ్గుతో మనస్సులో) నన్ను నాయన ఇచ్చిన యీమహారాజు ఈతడా ? తగినదే నాయన పక్షపాతం.

[తత్తరపాటు నభినయించును.

చేటి.—చీకాకుపెట్టినాయి గదా పాడుతుమ్మెదలుఆరణ్యిక ని. కనక దగ్గిరికి వెళ్లి ఓదారుస్తాను. ఆరణ్యికా, భయపడకు భయపడకు ఇదిగో వచ్చినాను.

విదూ.—ఓహోయ్యా, జరుగు; జరుగు ఇదె ఇందీవరిక వచ్చింది. ఈవృత్తాంతంగని దేవితోచెప్తుతుంది (వ్రేలితో చూపి) కనుక ఈ యరిటియింట్లోచొరబడదాం రా.

[ఇరువురును తొట్రుపాటుతో అవలి కేఁగుటను అభినయింతురు.

చేటి.—(సమీపించి) ఆరణ్యకా, తుమ్మెద లీలాగు తప్పుచేయడం వాటి దోషంగాదు, కమలంలాంటి నీమొగానిదే యీ దోషం. (చేయి పట్టుకొని) కనక రా పోదాము. పొద్దు గూఁకుతున్నది. [పోవుట నభినయింతురు.

ఆర.—(అరఁటి పొదరింటికేసి చూచి) చెలీ ఇందీవరికా, నీటిచలిమిరిచేత నాకు తొడవొణుకులాగ వచ్చివున్నది; మెల్లిగా వెళ్దాం.

చేటి.—అలాగే [అని నిష్క్రమింతురు.

విదూ.—రా వోయి వెలువడుదాం. ఆమెను దోడ్కొని యీ లంజెకూఁతురు ఇందీవరిక వెళ్లింది. [అట్లు చేయుదురు.

రాజు.—ఏమీ! పోయినదే! (నిట్టూర్పు పుచ్చి) మిత్త్రమా వసంతకుఁడా, విఘ్నములు లేక అధన్యులకోరికలు ఈడేఱవు సుమా. (చూచి) మిత్త్రమా, చూడు చూడు ;

తే. నోరు మూసికొనియును నీసారసవని
కంటకంబులఁ దాల్చినకారణమున
భామినీమణిమృదుపాణిపల్లవంపు
స్పర్శసమ్మోదమును దేటపఱుచుఁ జూవె. ౨౪

(నిశ్వసించి) ఏమి యిపుడు ఉపాయము ఆచెలువం గనుటకు ?

విదూ.—ఓయి నీవే బొమ్మను పగలగొట్టుకొని యిపుడు ఏడుస్తున్నావు. బాపనవాణ్ణని నామాట చెయ్యకపోయినావు.

రాజు.— ఏమి నేను చేయనైతిని?

విదూ.—అప్పుడే పరాకయిందా? అప్పుడు, మౌనంగా సమీపించ వోయి, అని నేను చెప్పితే, ఘట్టి యిఅకటంలో నీవు ప్రవేశించి లేని పాండిత్యపుబడాయి యొకటి కల్పించుకొని 'విశువకుము కోల యీతేంట్లు ముఃశరుకొనియె' అని యింకా ఏవేవో చేదుమాటలు పలికి బెదరగొట్టి యిప్పుడు ఏడుస్తు న్నావు. పైగా ఉపాయం అడుగుతావు.

రాజు.—ఏమి యిది! ఊఅడింపును సయితము బెదరిం పనుకొన్నాఁడు మూర్ఖుఁడు!

విదూ.— తెలియనే తెలిశింది ఇందులో ఎవడు మూర్ఖుడో. కానీ, ఈ మాటలకేమి? ప్రొద్దు గూకుతూవుంది; రా మఱి లోప లికి పోదాం.

రాజు.—(చూచి) అహో! పగటికి ముదిమి ముసరు చున్నది. కావున నిప్పుడు—

చ. కమలవనంపుశోభఁ గొని
కాంతవలెఁ దినలక్ష్మి యేఁగె, రా
గము రవిమండలిఁ ఘనము
గాఁ గన నయ్యెడి నాయెదఁ బలెఁ,

కమలినిచెంత నావలెనె
　　కాంతఁ దలంచుచుఁ గోక ముండెడిన్,
సమకొనె నాకుఁ బోలె దివ
　　సంబున కంతట నంధకారముల్. ఉ॥

[అని అందఱును నిష్క్రమింతురు.

ద్వితీయాంకము ముగిసినది.

---

# తృ తీ యాం క ము

---

(అంతట మనోరమ ప్రవేశించును.)

మనో.—దేవి వాసవదత్త నన్నాజ్ఞాపించింది— 'ఓసే మనోరమా, సాంకృత్యాయని యల్లిందే నాటకంగా ఆర్యపుత్రునిదిన్నీ నాదిన్నీ అయిన చరిత్రాన్ని, అందులో ఆడవలశిన మిగతను మీరు వెన్నెలపండుగలో ఆడవలశింది' అని. నిన్న నానెచ్చెలి ఆరణ్యిక పరధ్యానంలో వేరువిధంగా ఆడింది. నేడున్నూ వాసవదత్తవేషం వేసుకొని ఆలాగే ఆడితే దేవికి కోపం వస్తుంది. ఎక్కడ దాన్నిచూచి మందలింతును? (చూచి) ఇదిగో ఆరణ్యిక తనలో తానే ఏమో గొణుక్కుంటూ డిగ్గియకాడి యరిటి పొదరింటి లోపలికి పోతూవుంది! కనుక పొదపాటున ఉండి వింటాను గానీ దీని గుట్టుమాటలను.

(అంతట ఆరణ్యిక ప్రవేశించును.)

ఆర.—(కామావస్థను అభినయించుచు, నిశ్వసించి) హృదయమా, అందని పురుషుణ్ని కోరుతూ నీవు ఏల నన్ను దుఃఖింపాలు చేస్తావు?

మనో.—ఇదే అది, దీని పరధ్యానానికి కారణము. కాని, ఎవరిని ఇది పలిచింది? హెచ్చరికగా వింటాను.

ఆర.—(కన్నీళ్లతో) ఆవిధంగా అంత సౌమ్యంగా అగపడ్డ మహారాజు ఏల యీలాగు నన్ను కాకపెట్టుతున్నాడు! ఆశ్చర్య మాశ్చర్యం! (నిశ్వసించి) ఆలా గన నేల! నాదే యభాగ్యత్వంగాని మహారాజుతప్పు గాదు.

మనో.—(బాష్పములతో) ఏమీ! మహారాజే యీమెకు వలవదగినవాడు! బళీ! నెచ్చెలీ, బళీ! నీగొప్ప పుట్టుకకి తగివున్నది నీకోరిక.

ఆర.—ఎవరితో ఇపుడు ఈసంగతి చెప్పుకొని యీ వెతను సైపజాలుదును?(ఆలోచించి) కానీ, ఉన్నది నాకు నాహృదయమే అయిన నెచ్చెలి మనోరమ. దానితో సమేతూ ఈరహస్యాన్ని చెప్పడానికి బిడియపడుతూవున్నాను. నిజంగా మరణం దప్ప లేదు నాహృదయానికి వేరే ఊరట!

మనో.—అయ్యయ్యో! పాపం! దీనివలపు మేరమీరి పోయింది. మరి ఇందుకోసం నేనేమి చేతును?

ఆర.—(అభిలాషతో) ఎక్కడ తుమ్మెదలవల్ల నేను గాసిపడుతూవుండగా నన్ను చేపట్టి మహారాజు 'వెంపరీ భయపడకు' అని ఓదార్చెనో ఆచోటు ఇది.

మనో.—(సంతోషముతో) ఏమీ! దీన్ని మహారాజు చూడడంకూడా సంభవించిందా! తప్పకుండ దీనికి ప్రాణందక్కడానికి ఉపాయం ఉన్నది. దగ్గిరికి వెళ్లి దీన్ని ఊరడిస్తాను. (తటాలున దరసి) చెలీ, ఇసీ, తగునా యీలాగ హృదయందగ్గిర కూడా లజ్జపడడం?

ఆర.—(లజ్జ నభినయించుచు, ఆత్మగతము) అయ్యో! అయ్యో! ఇది అంతావిన్నది. కనక ఇక తెలియచేయడం సరే. (చేయిపట్టుకొని, వెల్లడిగా) నెచ్చెలీ, కోపగించకు కోపగించకు, ఈనేరం సిగ్గుదే గాని నాది గాదు.

మనో.—(హర్షముతో) చెలీ, జంకు మాను, ఇదొక్కటి నాకు జెప్పు, నిజంగా నిన్ను మహారాజు చూచినాడా లేదా?

ఆర.—(లజ్జతో, తలవాంచి) నెచ్చెలి సర్వంవిననే విన్నది.

మనో.—మహారాజు నిన్ను చూచినాడు గనక నీవు మఱీ వాగవ నక్కర లేదు. ఆయనే యిపుడు నిన్ను చూడడానికి ఉపాయం చూచుకొంటాడులే.

ఆర.—సకీ, పక్షపాతంచేత పలుకుతున్నావు; దేవి గుణాలు సంకిళ్లలాగ ఆయన్ని కట్టివేశివుండగా ఇది యేలాగ సంభవిస్తుంది?

మనో.—(నవ్వి) ఓసే గోలా, తామరతీగమీద ప్రేమ గల దైన తుమ్మెద జాజినిచూశి కొత్తతేనె చవిగొనడానికి నోరూరుతూ దాన్ని బొందక నిలుస్తుందా?

ఆర.—ఏల యీ కొరగానిమాటలు? ఈశరత్కాలపు ఎండకు నాయవయవాలు మరీ మరీ కాగిపోయి చల్లబడకున్నవి.

మనో.—ఓసే సిగ్గరీ, యిట్టి యవస్థలో నున్నా, నీవు నీగుట్టు దాచుకోవడంతగదు. [ఆర. మోము వాంచును.

మనో.—ఓసే నమ్మలేనిదానా,—

క. ఊరుపునెపమున వెలువడు
వారక రేఁబవలు నీదువలవంత చెలీ,
ధారాళంగాఁ బడు మరు
నారసముల ఝుంక్రియానినాదము యనఁగాఁ. ౨౬

(స్వగతము) కానీ, ఇది గాదు సమయం నిందలకి. తామ రాకులు దీనియెద పై గప్పుతాను. (లేచి, డిగ్గియనుండి తామ రాకులు తెచ్చి ఆరణ్యకహృదయమున నుంచి) సకీ, ఊరడిల్లు ఊరడిల్లు.

(అంతట విదూషకుఁడు ప్రవేశించును.

విదూ.—మరీ మరీ గొప్పదిగదా ప్రియవయస్యుడికి ఆరణ్యకమీద అనురాగం! అందువల్ల రాచకార్యాలన్నీ వదిలేశి ఆమెనే చూడడానికి ఉపాయం వెతుకుతూ మనస్సువినోదపెట్టుకొంటున్నాడు. (ఆలోచించి) కనక ఎక్కడ ఇప్పుడు ఆమెను కనకొంటాం దును. కానీ, అక్కడనే డిగ్గియదగ్గిరనే వెదుకుతాను.

[అని నడచును.

మనో.—(విని) అడుగుల చప్పుడులాగ వినబడుతూవుంది. అరటిపొదచాటున ఉండి ఈత డెవడో, చూతాం.

---

(ఛాయ.)

క. ఊరుపునెపాన వెలిబడు
వారక రేఁ బవలు నీది వలవంత చెలీ,
ధారాళంగా పడు మరు
నారాచాల్ ఝుమ్మనేటి నాద మనంగా.

[ఇరువురు అట్లు చూతురు.

ఆర.—ఏమీ! అతడే, మహారాజుతో వుండే బ్రాహ్మడు.

మనో.—(చూచి), ఏమి! వసంతకుడు! (సంతోషముతో, తనలో,) మఱి నేను తలచినట్లే అవునా ?

విదూ.—(దెసలు పరికించి) ఏమి ఇపుడు ఆరణ్యక వా స్తవంగానే ఆరణ్యక అయిందా ?

మనో.— (చిఱునవ్వుతో) సకీ, ఏలినవారి చెలికాడు బ్రాహ్మడు నిన్ను గుఱించి పలుకుతున్నాడు; కనుక అక్కరతో విందాం.

[ఆరణ్యక ఆసతోను లజ్జతోనువినును.

విదూ.—(వెఱపుతో) భరింపరాని వలరాచకాకకు వాడిలిపోతూ నన్ను ప్రియవయస్యుడు పంపితే నేను వాసవదత్తాదేవి పద్మావతీ దేవి కడముదేవేరులు ఈయుందఱి నగళ్లున్ను వెతికినాను గాని ఆరణ్యక ఎక్కడా లేదు. అంతటితో ఇక్కడ సమేతూ చూతా మని వచ్చినాను. కాని, యిక్కడానూ లేదాయెను, ఇక నిపు డేమి చేతును ?

మనో.—వింటివా నెచ్చెలీ ?

విదూ.—(ఆలోచించి) కానీ, వయస్యుడు నాతో చెప్పనే చెప్పినాడు, 'చెలిని వెదకిన్నీ గానవేని, అంత ఆకొమ్మయొక్క కెంగేలితాకుడుచే ఇమ్ముగా చలిమిరిగప్పే తామరాకులు గొని తెమ్మా' అని. మరి వాటి నేలాగున కనుక్కొందును ?

మనో.—ఇదే నాకు సమయం. (సమీపించి విదూషకుని చేయి పట్టుకొని) వసంతకా, రా నేను ఎరుకపరుస్తాను.

విదూ.—(భయముతో) ఎవరికి నీవు ఎరుకపరుస్తావు ? దేవికా ఏమి ? నే నేమీ అనలేదే !

మనో.—వసంతకా, భయపడకు. ఆరణ్యికకోసం నీ నేస్త కాడి వెత యెటువంటిదిగా వర్ణించినావో, దానికి రెండింతలుగా నున్నది మహారాజుకోసం నా నెచ్చెలి వెత; చూడు చూడు.

[సమీపించి ఆరణ్యికను చూపును.

విదూ.—(కని, స్వగతము) నా ప్రయాస ఫలించింది. (ప్రకాశము) అమ్మా నీకు క్షేమం.

[ఆర. లజ్జించుచు తామరాకులం ద్రోచివైచి నిలుచుండును.

మనో.—(చిఱునవ్వుతో) వసంతకయ్యా, నిన్ను చూశిన మాత్రానే నెచ్చెలి కాక తీరిపోయింది ; తీరకపోతే స్వయంగానే తామరాకులని ఏల తోశేస్తుంది ! మరి వీటిని పుచ్చుకోవయ్యా.

ఆర.—(తత్తరముతో) ఏమే వేళాకోళం మానవు? ఏల నన్ను సిగ్గుపరుస్తావు?

[ఇంచుక పెడమొగం బయి నిలుచును.

విదూ.—(విషాదముతో) తామరాకుల మాట అటుండనీ. నీనెచ్చెలి శానా సిగ్గరి. ఈలాగైతే వీరికి పొందు ఏలాగ ఘటిల్లుతుంది ?

మనో.—(క్షణ మాలోచించి, సంతోషముతో) వసంతకయ్యా, ఈలాగ. [చెవిలో చెప్పును.

విదూ.—బళీ! మనోరమా, బళి! (అపవారించి) మీరు పోయి వేషము దాల్చేటప్పటికే నేనున్ను ప్రియవయస్యుణ్ని తోడ్కొని వస్తాను.

మనో.—ఎంత కోపమే! లేవే లేవే. ఆనాటకంలోనే ఆడవలెశిన మిగత మనం ఆడవలెగదా. రా మఱి నాటకశాలకే పోదాం. (నడచి, చూచి) ఇదే నాటకశాల. రా ప్రవేశింతాం (ప్రవేశాభినయముతో చూచి) దీన్ని అప్పుడే చక్కగా సిద్ధం చేసినారు గనక, దేవి వచ్చేసమయం ఐంది.

(అంతట దేవియు సాంకృత్యాయనియు విభవంబుగా పరివారంబును ప్రవేశింతురు.)

వాస.—భగవతీ, ఎంతవింతగా నున్నది నీకవనము! ఎట్లంటే, ఈకవనంచేత ఈవృత్తాంతం మాయార్యపుత్త్రుడి చరిత్రమే నాటకంగా అల్లినటువంటిది నాకు అనుభవమేఅయినా, చూచేటప్పుడు మును పెప్పుడున్ను చూడనిదానిలాగ ఆశ పుట్టిస్తూ వుంది.

సాంకృ.—ఆయుష్మతీ, నీరసకావ్యము సంగీతము విను వారి వీనులకు విందొనర్చుట ఆశ్రయప్రభావము గాని యొండు గాదు. కనుము,

క. ఎదియును దానస దయ్యును
నొదవినమహదాశ్రయమున నొందును మహిమల్;

మదగజకుంభగతం బై
పొదలదె బూదియును బొరసి భూషణపదవిన్ ? ౨౭

వాస.—(చిఱునగవుతో) భగవతీ, తెలుస్తూనే ఉంది అల్లుడు ఎల్లవారికిన్నీ వల్లభుడని. ఏల యీ ప్రస్తావం పెంచడం? ఆ నాట్యం చూడడమే మేలు.

సాంకృ—అవును. ఇందీవరకా, నాటకశాలకు దారి చూపుము.

చేటి.—దేవి ఇటు రావలె. [స్త్రీలందఱు నడతురు.

సాంకృ.—(చూచి) అహో నాటకశాల యెంత కన్నుల పండువుగా నున్నది !

తే. వలుదము త్తెంపుఁ గలువడంబులను దాల్చి
రతనపుంబై ఁడికంబముల్ రాజిలంగ,
అచ్చరల మించుజవ్వను లధివసింప,
సురవిమానంబుగతి నొప్పుఁ జూపుటిల్లు. ౨౮

మనో. ఆర.—(సమీపించి) జయం జయం దేవికి.

వాస.—సంజ దాటిపోయింది. మఱి పోండి, తర్వగా వేషాలు వేసుకోండి.

ఇరువురు.— దేవియాజ్ఞ. [అని యిరువురు తరలుదురు.

వాస.—ఆరణ్యకా, వీటిని నావొంట నేను పెట్టుకొన్న ఈ యాభరణాలని పుచ్చుకొని నేపథ్యగృహానికి వెళ్లి వీటినే నీవు అలంకరించుకో, (అని ఆభరణములను ఒడలి నుండి తీసి యిచ్చి) మనోరమా, నీవున్ను మానాయన ఆర్యపుత్త్రుడికి వలగిరిని పట్టి

నందుకోసం మెచ్చుకొని యిచ్చిన యాభరణాలని ఇందీవరిక చేతి నుంచిపుచ్చుకొని నేపథ్య గృహానికివెళ్లి వాటిని నీవు అలంకరించుకో; ఆలా చేస్తే మహారాజును సరిగా సరిపోల్తావు.

[మనో ఇందీవరికయొద్దనుండి నగలం గైకొని ఆరణ్యికతో నిష్క్రమించును.

ఇందీ.—ఇదుగో ఆసనం, దేవి కూర్చోవచ్చును.

వాస.—(ఆసనముం జూపి) భగవతిన్ని కూర్చుండవలె.

ఇరువురును కూర్చుండుట నభినయింతురు.]

(అంతట వేసము దాల్చిన కంచుకి ప్రవేశించును.)

తే. భవ్యత నొనర్తు నంతఃపురవ్యవస్థ;
గనుదుఁ బ్రతిపదమునను సంస్ఖలితములను,
దండనీతిని జక్కఁగా దాల్చి నడుతు,
మొనసె నృపవృత్త మెల్లను ముదిమి నాకు. ౨౯

తనదండుచే శత్రువుల నెల్ల ఓడించినందును అన్వర్థనామధేయుడైన మహాసేన మహారాజు—రేపు మేము మదనోత్సవమనుభవించెదము, అందులకు ఉత్సవమునకుం దగిన వేషముచే వెలుఁగొందెడి పరిజనముతోఁ గూడ మీరు మన్మథోద్యానమునకు రావలసినది;—అని, రాణివాసములకు తెలుపుడు సేయుమని నన్ను ఆజ్ఞాపించినాఁడు.

సాంకృ.—(కంచుకిని చూపి) ఆట ఆరంభమయినది; చూడుము.

కంచు.—అయినను, పరిజనముతో రావలసినది అని తెల్పినం జాలును, 'వేషముచే వెలుఁగొందెడి' యన నక్కఱ లేదు. ఏలన:

ఉ. అందెలు కాళ్ల, శింజిత స
ముంచిత కాంచిక శ్రోణిమండలిన్,
సందిట బాజిబందులుఁ, గు
చస్థలి బన్నసరంబులున్, శిరం
బందును నాగరంబుఁ, జెవు
లందును గమ్మలునున్ జ్వలించెడున్
గ్రందుగ రాణిగార్ల యుడి
గంపుఁ దుటారి మిటారి పాళికిన్. 30

ఇట క్రొత్తగా చేయవలసినది ఏమియు లేదు. కేవలము ప్రభువునానతి యని తలఁచి నేను నాకు నియమింపఁబడిన యాయాజ్ఞాశేషమును రాజకుమారి కెఱుక చేసెదను. (అని నడచి, చూచియు) కేల వీణియం గొని కాంచనమాల వెంట రా ఇదిగో వాసవదత్త సంగీతశాలం జొచ్చినది. ఈమెతో చెప్పెదను. [అని నడచును.

(అంత వాసవదత్తావేషము దాల్చి ఆసనమందు గూర్చున్నదిగా ఆరణ్యకయు వీణం గేలఁ గొని కాంచనమాలయు ప్రవేశింతురు.)

ఆర.—ఓసే, కాంచనమాలా, ఏల మఱి విలంబిస్తున్నాడు నేడు వీణాగురువు?

కాంచ.—భర్తృదారికా, ఆయన ఒక వెఱ్ఱివాణ్ని చూచినాడు, వాడిమాటలు విని వింతపడి నవ్వుతూ ఉన్నాడు.

ఆర.—(చప్పట్లు చఱచుచు, నవ్వి) ఓసే, చక్కనిమాట సుమా 'సమానులు సమానులమీద అనురక్తు లవుతారు' అన్నమాట. ఇద్దరున్ను ఇందులో ఉన్మత్తులే గదా.

సాంకృ.—రాకుమారీ, నీపోలికగా ఈ మెయాకారము నాకగపడుచున్నది. అట్టి యాకారముతో తప్పకుండ నీవేష మును చక్కఁగా నెఱవేర్చును.

కంచు.—(సమీపించి) రాజపుత్త్రీ, ఏలినవారు నిన్ను ఆజ్ఞాపించినారు 'రేపు తప్పక మేము నీవీణావాదనమును విన వలయును. అందుకై నీవు తొమ్మిదితంతులుకట్టిన ఘోషవతిని కొనిరావలయును' అని.

ఆర.—అయ్యా, అలాగైతే వెంటనే మావీణాగురు వును పంపు.

కంచు.—ఇదె వత్సరాజును పంపెదను.

[అని నిష్క్రమించును.

ఆర.—కాఞ్చనమాలా, నా చేతి కీవే ఘోషవతిని, దాని తంతులు పరీక్షిస్తాను.

[కాంచ.—వీణ నిచ్చును. ఆర.—వీణను ఒడిలో పెట్టు కొని తంతులను తుడుచును.

(అంతట వత్సరాజువేసమున మనోరమ ప్రవేశించును.)

మనో.—(స్వగతము) తామసిస్తున్నాడు మహారాజు. చెప్పలే దేమో వసంతకుడు? కాకపోతే ప్రభువు దేవికి వెరుస్తు న్నాఁడా? ఇప్పుడు వస్తే బాగా ఉంటుంది.

(అంతట రాజును, బురఖా వేసికొని విదూషకుఁడును, ప్రవేశింతురు. )

రాజు.—

ఉ. ఇప్పుడె పూర్వరీతిఁ దపి
యించుట మానె నను౯ సుధాకరుం,
డిప్పుడె మానె మోవి నల
యించుట మున్వలె వేఁడియూరుపుల్,
ఇప్పుడె రిత్త గాదు మది,
యిచ్చె యమందము లయ్యె నంగముల్!
తప్పెడుఁ జూవె కోర్కులను
ధ్యానము సేసెడుమాత్రకే వగల్. . ౩౧

వయస్యా, నిజమేనా మనోరమ చెప్పినమాట ? ఏ మనఁగా—'ఇదె ఈనానెచ్చెలిని మహారాజుకంటబడారిలో నేనియు పడనీయక దేవి కాపాడుచున్నది. దానంజేసి సమాగమమునకు ఇదిగో ఉపాయము: ఈ రాత్రి మేము ఉదయనచరిత మను నాటకమును దేవిమ్రోల నాడెదము. అందు ఆరణ్యిక వాసవ దత్తావేషము వేసికొనును, నేనును వత్సరాజ నయ్యెదను; అతని చరితమును బట్టియే సర్వమును ఆడవలయును; కావున ఆయన తానే వచ్చి తన వేషమును నెఱవేర్చి సమాగమోత్సవము ననుభ వించుఁగావుత.' అని ?

విదూ.—నామాటలో నమ్మకం లేకుంటే, ఇదుగో మనో రమ నీ వేషం వేసుకొని వున్నది, దగ్గిరికి పోయి నీవే అడుగు.

రాజు.—(మనోరమకడకుం జని) మనోరమా, నిజమే వసంతకుఁడు చెప్పినది?

మనో.—దేవా, నిజం. ఈ నగలను అలంకరించుకో.

[అని నగలను తన యొడలినుండి తీసి యిచ్చును.
రాజు ధరించును.]

విదూ.—ఈ రాజులనూ దాసీ సమేతూ ఇలాగ ఆడిస్తుంది! ఆహా! కార్యగౌరవం!

రాజు.—(నవ్వి) మూర్ఖుఁడా, ఇది కాదోయి సమయము ఎగతాళికి. రహస్యముగా చిత్రశాలకుఁ బోయి మనోరమతోఁ గూడ మాయాటను చూచుచుందుము.

[విదూ.—అట్లు సేయును.

ఆర.—కాంచనమాలా, వీణను ఉండనీ, ఒక మాట అడుగుతాను చెప్పు.

రాజు.—వినియెదఁగాక, సందర్భము ఏదిగా నున్నదో అని. [అక్కడగా వినును.

కాంచ.—అడుగు భర్తృదారికా.

ఆర.—నిజంగానే నాయన చెప్పినాడా? ఏమనంటే— 'వీణ వాయింపిస్తూ వత్సరాజు నన్ను మెప్పిస్తే, తప్పకుండా విడిచిపెడ్తాను' అని.

రాజు.—(అపటీక్షేపంబునం బ్రవేశించి, సంతసముతో వలువయ్యంచున ముడివైచి) సరియే ఇది. సందేహ మేమి?

తే. పరిజనాన్వితుఁ బ్రద్యోతు వెరఁగుపఱిచి,
వీణ వాయించుచును మహా విభ్రమమునఁ,
జూడుఁ డిందుల సందేహ మేడ? నేఁడ
దక్కఁ గొనిపోదు వాసవదత్త నేను. 3౨

ఎట్లన, యౌగంధరాయణుఁడు సకలమును చక్కఁగా ఏర్పఱిచి యున్నాఁడు.

వాస.—(తటాలున లేచి) జయం ఆర్యపుత్త్రుడికి.

రాజు.—(స్వగతము) ఇఁక నెట్లు? దేవి నన్ను తెలిసికొన్న దే!

సాంకృ.—ఏల తొట్రుపాటు? ఆటయే గదా యిది!

వాస.—(వెడనవ్వు నవ్వుచు కూర్చుండి) ఏమి! మనోరమ గదా యిది. ఆర్యపుత్త్రుడే అని నే ననుకొన్నాను. బళీ మనోరమా, బళి! చక్కగా ఆడినావు.

రాజు.—(సంతోషముతో, తనలో,) ఇప్పుడు నాదిగులు తీఱినది.

సాంకృ.—రాజకుమారీ, మనోరమ యీ భ్రాంతిని కలిగించుట యుక్తమే. కనుము.—

మ. అదియే రూపము నేత్రపర్వ! మదియే
యౌజ్జ్వల్యవద్వేష! మ
ల్లదియే మత్తగజోచితంబు గమనం!
బాసత్త్వమే యూర్జితం!

బదియే లీల ! స్వరంబు నల్లదిరొ సాం
ద్రాంభోదనిర్హ్రాది ! మేల్ !
చదు రొప్పం గనిపించె నీచెలువ సా
తూద్వత్సభూనాయకుఁ. 33

వాస —ఓసే, ఇందీవరి కా, సంకిళ్ల లో ఉండి ఆర్యపుత్త్రుడు నాకు వీణ నేర్పినాడు. అందుచేత ఈయనకు నల్లగలువదండతో సంకిళ్లు వేయవే.

[అని తలనుండి తీసి నల్లగలువలదండను ఇచ్చును. ఇందీవరిక అట్లుచేసి వెండియు మునుపటివలెనే కూర్చుండును.

ఆర.—కాంచనమాలా, చెప్పు, మరి నిజంగా మా నాయన ఈమాటచెప్పెనా 'వీణావాదనముతో నన్ను వత్సరాజు అపహరించినట్టయితే అంతట తప్పక విడుస్తాన' ని ?

కాంచ.—భర్తృదారికా, నిజమే. నీవున్ను ఏలాగ చేస్తే వత్సరాజు నిన్ను మెచ్చుకొంటాడో ఆలాగ చేయి.

రాజు.—మేము చెప్పవలసిన దానిని కాంచనమాల చక్కఁగా నెలకొల్పినది.

ఆర.—అపటూన అక్కరతో వాయిస్తాను.

[పాడుచు వాయించును.

క. ఘన బంధన రుద్ధంబును
గని యాకాశమును దనదు కాంతను దనతా
వునకుఁ మానసమునకుఁ
గొని చన రాయంచకొదమ కోరికపడెడిఁ. 34

[విదూ.—నిద్ర నభినయించును.

మనో.—(చేతితో కదలించుచు) వసంతకా, చూడు చూడు నానెచ్చెలి ఆడుతూ వుంది.

విదూ.—(కోపముతో) లంజెకూతురా, నీవుకూడా నన్ను నిద్రపోనియ్యవా? ఎప్పుడు తొలిమారు ప్రియవయస్యుడు ఆరణ్యికను చూచినాడో అప్పటినుంచి అతనితో గూడ నాకున్ను రాత్రింబగులు నిద్ర లేదు. కనుక బైటికివెళ్లి నిద్రపోతాను.

[అని వెలికేఁగి పరుండును.

ఆర.—(మరల పాడును.)

తే. క్రొత్తవలపు గొలిపి యుత్తలంపెట్టెడు
క్రించుమరుని బారికిం దలంకి
తేఁటిముగుద కాంచఁ దివురుచునున్నది
యొదను జూఁ అగొనినయొమ్మెకాని. 3౫

రాజు.—(విని తటాలున దరిసి) బళీ! రాజకుమారీ, బళీ! ఆహా పాట! ఆహా వాద్యము! అట్లే గదా:—

శా. ప్రాపై వ్యంజనధాతువుల్పదియు సం
పాదించె వ్యక్తత్వముల్;
బ్రాపించె న్లయ మధ్యమద్రుతవిలం
బచ్ఛిన్నమై తెల్లమై;
గోపుచ్ఛప్రముఖంబు లౌ యతులు నే
కూర్చెన్ రహిన్ మూఁడునున్;
జూపంగాఁబడెఁ దత్త్వపూర్వకము లై
సొంపారు వాద్యక్రియల్. 3౬

ఆర —(వీణను వదలి ఆసనమునుండి లేచి రాజును కోర్కెతో కనుచు) ఒజ్జా, మ్రొక్కుతున్నాను.

రాజు.—(నవ్వుచు) ఏది నేను కోరుచున్నానో అది నీ కగునుగాక.

కాంచ.—(ఆరణ్యిక కూర్చున్న యాసనమును చూపి) ఒజ్జగారు ఇక్కడనే కూర్చుండవలెను.

రాజు.—(కూర్చుండి) రాజకుమారి యిపు డెటఁ గూర్చుండవలయును ?

కాంచ.—(నవ్వుచు) ఇపుడే భర్తృదారికను మీరు విద్యాతిశయానికి మెచ్చుకొన్నారు. కనుక ఈమె ఒజ్జగారి పీఠానికి తగినదే.

రాజు.—కూర్చుండునుగాక, ఈసుందరి అర్ధాసనమునకు తగినదే; రాజకుమారీ కూర్చుండుము.

[ఆర.—కాంచనమాలం గనును.

కాంచ.—(నవ్వుచు) భర్తృదారికా, కూర్చో; ఏమి యిందులో దోషం? విశేషమయిన శిష్యవు గదా నీవు.

[ఆర.—సలజ్జముగా కూర్చుండును.

వాస.—(లజ్జతో) భగవతీ, కావ్యాన్ని ఎక్కువగా కల్పించినావు. ఆ సమయంలో నేను ఆర్యపుత్రునితో ఏకా సనంలో కూర్చోనే లేదు.

రాజు.—రాజకుమారీ, వెండియు వినఁగోరికగా నున్నది, వాయింపుము వీణను.

ఆర.—(చిఱునవ్వుతో) కాంచనమాలా, శానాసేప ట్నుంచి వాయిస్తున్నందున నాకు అలుపుగా ఉంది. ఇప్పుడు నా ఒళ్లు డస్సిఉన్నది, కనుక వాయించడానికి శక్తురాలనుగాను.

కాంచ.—ఔజ్జా, ఎంతో డస్సిపోయింది భర్తృదారిక, చెక్కిళ్లమీదకొత్తచెమట మొగ్గలలాగు బొట్లు కట్టివున్నది; చూడు ఈ మెముంజేతులు వణుకుతున్నవి. కనుక రవంతసేపు అలుపు తీర్చుకోనీ.

రాజు.—కాంచనమాలా, సరిగా చెప్పితివి.

[అని చేయి పట్టుకొనఁ బోవును.

[ఆర.—చేయి వెనుకకు తీసికొనును.

వాస.—(అసూయతో) భగవతీ, నీవు ఎక్కువగా కల్పించినావు. కాంచనమాల చేసిన కావ్యంతో వన్ను వంచించ వల్లపడదు.

సాంకృ.—(నవ్వి) ఆయుష్మతీ, కావ్యమనఁగా ఇట్టిది గానే యుండును.

ఆర.—(కోపముతోనుంబోలె) పో కాంచనమాలా పో, నీకూ నాకూ సరిపడదు.

కాంచ.—(చిఱునవ్వుతో) నేను ఉంటే సమ్మతి గాక పోతే పోతాను లే. [అని నిష్క్రమించును.

ఆర.—(తత్తరపాటుతో) కాంచనమాలా, పోకు పోకు. ఇదుగో యీాయనకు ఇచ్చితిని ముంజేతిని.

రాజు.—(ఆరణ్యకచేతిని జైకొని)

సీ. అప్పుడె మంచుబొట్లప్పళింపఁగఁ జల్వ
లగ్గలించెడుతమ్మి మొగ్గయొకొ?
వేకువనే యొండఁ బీల్చుదానను దాన
నీసహాజాహ్లాద మెట్లు గల్గు?
తోరంబుగా నిట్లు తోరఁగెడును హిమంబుఁ;
బరికింపఁగా హిమభానుఁ డొకొ?
అవుర! యాతం డెట్టు లగు? వెల్గుసూదులఁ
జూఱచుఱ విరహులఁ జూడు నతఁడు;
తే. ఇంక మఱి యేదొ యిది? యహో! యెఱుఁగనేర!
నహహా! తెలిసెను! నునుఁజెమ రనుమిషమున
నమృతవర్షంబు గురిసెడు ననవరతము,
నద్భుతస్పర్శనము ప్రియాహస్తము యిది!

మఱియు,—

తే. లేఁతపవడంపుఁజివుళులలీల నేలు
నట్టిదీనను నీదుస్వహస్తమునను
స్వయముగా నీవు నాదుహృదయమునందు
రాగమును బెట్టితివి రాజరాజవదన. 32

ఆర.—(స్పర్శవిశేషము నభినయించుచు మనస్సులో) అయ్యయో! ఈమనోహరుణ్ని చేతికొనతోచే తాకినంత మాత్రాన నాయవయవాలు ఆనందము పొందుతున్నవి.

వాస.—(తటాలున లేచి) భగవతీ, నీవు చూడు. నే నేమో యీ కల్లను చూడ నొల్లను.

సాంకృ.—రాజకుమారీ, ధర్మశాస్త్రమందు విధింపఁబడి నది యిది గాంధర్వవివాహము. ఇందు లజ్జకు కారణ మే మున్నది? ఆట ఇది, కావున అకారణముగా రసము చెడఁగొట్టి లేచిపోవుట యుక్తముగాదు. [వాస.—నడచును.

ఇందీ.—(చూచి) దేవీ, వసంతకుడు చిత్రశాలద్వారంలో నిద్రపోతున్నాడు.

వాస.—(చూచి) వసంతకుడే యితడు. (ఆలోచించి) రాజు కూడా ఇక్కడనే ఉండును. ఇతణ్ని నిద్రలేపి అడుగు తాను. [నిద్ర లేపును.

విదూ.—(నిద్రమబ్బుతో లేచి తటాలున చూచి) మనో రమా, ఏమి ఆడి వచ్చినాడా ప్రియవయస్యుడు, లేక ఆడు తూనే వున్నాడా ?

వాస.—(వగపుతో) ఏమీ! ఆర్యపుత్త్రుడా ఆడు తున్నాడు! మరి మనోరమ యేమైంది?

విదూ.—ఇదుగో చిత్రశాలలో వుంది.

మనో.—(భయముతో) ఏమి! మనస్సులో వేరే అభి ప్రాయంతో దేవి పలికితే, ఈ తెలివితక్కువకుట్టివాడు మరి యొకవిధంగా గ్రహించి సమస్తం పాడుచేసినాడు.

వాస.—(కోపముతో, నవ్వుచు) లెస్స! మనోరమా, లెస్స! చక్కగా నటించినావే నీవు!

మనో.—(భయముతో వణఁకుచు పాదములలో వ్రాలి) దేవీ, ఇందులో నాతప్పేమీ లేదు. ఈ చెడిబదికినవాడు బలిమి చేత నాచేతి అలంకారాలు లాక్కొని ద్వారంలో ఉండి నన్నిక్కడ అరికట్టినాడు. నేను ఎంత మొరపెట్టినా మద్దెళమోతలో నా మొర ఎవరికిన్ని వినబడ్డదిగాదు.

వాస.—ఓసే లే. తెలిసింది సమస్తం. వసంతకుడు గదా ఆరణ్యికావృత్తాంత నాటక సూత్రధారుడు.

విదూ.—దేవీ, ఆలోచించు, ఆరణ్యిక యెక్కడ, వసంతకు డెక్కడ!

వాస.—మనోరమా, ఇతణ్ని దిట్టంగా పట్టుకొని రా. ఇతనినాటకాన్ని చూతాము.

మనో.—(స్వగతము) ఇప్పుడు నాయడలు తీరింది. (ప్రకాశము) సరే. (అని విదూషకుని గొంతు కట్టి) చెడిబదికిన బాపడా, ఇప్పుడు అనుభవించు నీచెడునీతికి ఫలం.

వాస.—(తొట్రుపాటుతో సమీపించి) ఆర్యపుత్రా, అమంగళం పోవుగాక!

[అని పాదములనుండి నల్లగలువదండను తీసివైచును.

ఆర.—భయముతో ఆవలికి జరిగి నిలుచుండును.

రాజు.—(తటాలున లేచి విదూషకుని మనోరమను గాంచి, ఆత్మగతము) ఏమి! తెలిసికొన్నారే నన్ను!

[వెఱగుపాటు నభినయించును.

వాస.—(ఉపహాసముతో) మన్నించు ఆర్యపుత్రా, మనో రమ వనుకొని నిన్ను వల్లగలువదండతో కట్టించినాను.

సాంకృ.—(అందఱను కని, చిఱునవ్వుతో) ఏమి! ఇది వేళే ఆటగా పరిణమించినదే! మాబోంట్ల కిది తావు గాదు.

[అని నిష్క్రమించును.

రాజు.—(ఆత్మగతము) ఈకోపవిధము అపూర్వముగా నున్నది. ఊఱడించుట అసాధ్యముగా నగపడుచున్నది. (ఆలోచించి) కానీ ఇట్లు చేసెదను. (ప్రకాశము) దేవీ, కోపము మానుము.

వాస.—ఎవ రిక్కడ కోపగించినారు?

రాజు.—ఏమి నీవు కోపగింపలేదా?

ఉ. నెయ్యముఁ జూపు దాల్చినను,
నేత్రము శోణసరోజమిత్రమే;
తియ్యము మీఱియుఁ బలుకు
దీల్పడుఁ దొట్రిలు గద్గదం బగుఁ;
చయ్యన డించిరఁ దెలియుఁ
జన్నవకంపముచేత నూరుఫుల్ ;
అయ్యెను! బై ప్రసాద మివి
యద్దమ నీరుష డాఁగురింపఁగాఁ! 3౮

మన్నింపుము ప్రియా, మన్నింపుము.

వాస.—ఆరణ్యకా, నీవు అలిగినావని యార్యపుత్రుడు మన్నింపు వేడఁ కొంటున్నాడు, దగ్గిరికి వెళ్లు.

ఆర.—(భయముతో) దేవీ, నే నేమీ యెఱగను.

వాస.—ఆరణ్యికా, ఏమి! నీవెఱగవా? ఇదుగో నీకు నేర్పుతాను. ఇందీవరికా, దీన్ని పట్టుకోవే.

విదూ.—అమ్మా, నేడు వెన్నెలపండగ అని నీచిత్తం పొందడానికి వయస్యుడు ఆట ఆడినాడు.

వాస.—ఈ మీ చెనటిచెయ్దం చూడగా నాకు నవ్వు వస్తున్నది.

రాజు.—వేరువిధముగా తలంపవలదు. కనుము.—

ఉ. ఏల కళంకిఁ జేసెదు ము
ఖేందునిఁ గన్బొమలన్ ముడుంచుచున్ ?
గాలికి నాడుమం కెనవ
గన్ బొరయించెదు మోవి నేలొకో ?
సోలెడిఁ గా నురోజభృతి,
స్రుక్కఁగఁ జేసెద వేల యింకనున్ ?
ఖేలన మీ క్రియన్ నిను న
గింపనె చేసితి; మాను కోపమున్. 3౯

దేవీ, క్షమింపు క్షమింపు. [అని యడుగులలో వ్రాలును.

వాస.—ఓసే ఆట ముగిసింది. మరి రా, లోనికే పోదాము.

[అని స్త్రీసమూహంబును విదూషకుండును నిష్క్రమింతురు.

రాజు.—ఏమి! మన్నింపక యే పోయినది దేవి !

ఉ. ఒక్కటి భ్రూకుటీధరము
నుత్కటఘర్మకణంబుఁ జిందమున్,
దక్కెఁ భయాకులంబుఁ జకి
త ప్లవమానమృగీవిలోకమున్,
దక్కిన దేవిమోము దయి
తాముఖపద్మము వ్రాలఁ గాంచుచున్
జిక్కితి భీతిచే వలపు
చేతను నే బలుసంకటంబునన్. ౪౦

కావున నిపుడు పడకకుం బోయి దేవిని అలుకదీర్చునుపాయ మరసెదను.

[అందఱు నిష్క్రమింతురు.

తృతీయాంకము ముగిసినది.

---

# ప్రవేశకము

---

(అంతట మనోరమ ప్రవేశించును.)

మనో.—(భయముతో) అయ్యో! ఎంతదీర్ఘకోపం దేవికి! ఇంత కాలం చెరలో ఉంచిన్నీ నాయనుగు జెలిని ఆరణ్యకని కనికరింపదాయను! (కన్నీళ్లతో) ఆదీనురాలు రాజు నిక చూడ ననే నిరాశచేత వ్యసనపడుతున్నదే గాని తనచెరకు సమేతూ అంత వ్యసనపడడం లేదు. ఆమె ఆదుఃఖంచేత ఇప్పుడే ప్రాణాన్ని వదలనుండగా ఎట్టకేలకు నేను నివారించి నాను. ఈవృత్తాంతాన్ని ఏలినవారికి దెలపమని వసంతకయ్యతో చెప్పివస్తున్నాను.

(అంతట కాంచనమాల ప్రవేశించును.)

కాంచ —ఏమి! ఎంతవెదికినా నాకు భగవతి సాంకృత్యాయని కనబడదాయను; (చూచి) మరి ఈ మనోరమని గూడ అడుగుతా. (సమీపించి) మనోరమా, ఎరుగుదువా భగవతి సాంకృత్యాయని యెక్కడ వుందో?

మనో.—(చూచి, కన్నీళ్లు తుడుచుకొన్ని) ఒసే కాంచన మాలా, ఆమెతో నీకేం పనే?

కాంచ —మనోరమా, నేడు అంగారవతీదేవికొణ్ణుంచి జాబు వచ్చింది. దాన్ని చదువుకొని కన్నీళ్లు నించుకొని మిక్కుటంగా దేవి వ్యసనపడుతూవుంది. ఆమెను ఓదార్చడానికి భగవతిని వెదుకుతున్నాను.

మనో.—ఓసే, మరి ఆజాబులో ఏముంది?

కాంచ.—'నా తోబుట్టువు పెనిమిటి దృఢవర్మ నీకు తండ్రి గాడా? నీకు వేరే చెప్పవలెనా? ఆయన్ని పాదలికళింగుడు చెరలో ఉంచి సంవత్సరానికి పైబడ్డది. గనక ఈవృత్తాంతాన్ని సమర్థుడికి నీభర్తకు నీవు తెలపకుండ ఊరోకోవడం సరికాదు.' అని.

మనో.—చెలీ, కాంచనమాలా, ఈవృత్తాంతాన్ని ఎవ్వరున్ను దేవికి విన్నపించ వద్దని ప్రభువు ఆజ్ఞాపించివుండఁగా ఎవ రిపుడు ఆమెకి ఆజాబు చదివి వినిపించినవారు?

కాంచ.—చదువుకొని ఊరుకున్న నాచేతులోనుంచి తీసుకుని దేవి తానే చదువుకుంది.

మనో.—అటయితే నీవు వెళ్లు. ఇదుగో దేవి ఆమె తోఁటే దంతపుమేడలో వుంది.

కాంచ.—అటయితే దేవికాడికి వెళ్తాను.

[అని నిష్క్రమించును.

మనో.—నేను ఆరణ్యకకాణ్ణుంచి వచ్చి చాలా సేపు అయింది. పాపం! అది తనప్రాణంమీాద ఎంతో విసిగిపోయింది. ఒకవేళ గొప్పచేట్ట కలిగినా కలుగుతుంది. కనక, అక్కడికే వెళ్తాను. [అని నిష్క్రమించును.

ప్రవేశకము ముగిసినది.

———

# చతుర్థాంకము

(అంతట దుఃఖాక్రాంతురాలై ఆసనస్థ వాసవదత్తయు, సాంకృత్యాయనియు విభవంబుగా పరివారమును ప్రవేశింతురు.)

సాంకృ.—రాజకుమారీ, దిగులుపడవలదు. ఇట్టివాఁడు కాఁడు వత్సరాజు. నీతల్లితోఁబుట్టువుయొక్క పెనిమిటి యిట్టి యిడుముపా లయినాఁ డని యెఱిఁగి వత్సరాజు నిశ్చింతగా నుండునా ?

వాస.—(కన్నీళ్లతో) భగవతీ, నీవు ఇప్పుడు ఎంతైనా తిన్ననిదానవు; ఆయనకు నాతోఁటే పని లేదే, నావాళ్లతో నేంపని ? అమ్మకు తగును నా కీలాగవ్రాయడం. ఏలంటే, ఆమె ఇప్పటికిన్నీ వాసవదత్త మునపటివాసవదత్తే అని అనుకోంటూ వుంది. నీకైతేనో ఈయరణ్యకావృత్తాంతం ప్రత్యక్షం. నీవున్ను ఈలాగ చెప్తావేమి ?

సాంకృ.—నాకు ప్రత్యక్షమయినందుననే పలికెదను. ఆయన నిశ్చయముగా కౌముదీ మహోత్సవములో నిన్ను నవ్వించుటకు అట్లు ఆడినాఁడు.

వాస.—భగవతీ, ఇట్లు నిజంగా నవ్వులపాలుచేశినాఁడు, కనుకనే భగవతియెదట లజ్జచేత ఎట్టకేలకు ఉన్నాను. ఏల ఆవిషయాన్ని గుఱించిన మాటలు ? ఈపక్షపాతంచేతనే ఈ దశకు వచ్చినాను. [అని యేడ్చును.

సాంకృ.—రాజపుత్రీ, ఏడువకు; వత్సరాజు ఇట్టివాఁడు కాఁడు. (చూచి) పోనీ, నామాట లేల? రానే వచ్చినాఁడు నీశోకమును దీర్చువాఁడు వత్సరాజు.

వాస.—ఇవి భగవతి కోరికలు.

(అంతట రాజును విదూషకుఁడును ప్రవేశింతురు.)

రాజు.—ఏమి యుపాయము ప్రియను విడిపించుటకు?

విదూ.—వయస్యుఁడా, వగవకు; నేను నీకు ఉపాయం చెప్తాను.

రాజు.—వయస్యా, త్వరగా చెప్పవోయి.

విదూ.—ఓయ్యోవ్, నీకు మరి పెక్కుపోరులలో దోమ్ములలో తిన్న దెబ్బలకి మచ్చలుగట్టిన బుజందూలాలు వున్నవి. పయిగా, లేస్తివా, ఏనుగల గుఱ్ఱాల కాలుబంట్ల పేద్ద రాణువతో లేస్తావు. కనక నీసైన్యాలన్నిటినీ మొత్తంచేశి అంతఃపురానికి ముట్టడేసి ఇప్పుడే ఆరణ్యికని విడిపించు.

రాజు.—వయస్యా, అసాధ్యము నుపదేశించితివి.

విదూ.—ఇందులో అసాధ్యమే ముంది? ఎందుకంటే— అక్కడ గుజ్జుకులుచ వెంగలి ముదుక యంగజాలలు దప్ప వేరే నరమానవుడు లేడు.

రాజు.—(తిరస్కారముతో) ఏమి అసంగతములు ప్రేలఁ జొచ్చితివి? దేవియనుగ్రహము తప్ప ప్రియను విడిపింప ఒండు ఉపాయము లేదు. కనుక దేవియనుగ్రహమునకు ఉపాయము చెప్పుము.

విదూ.—అయితే ప్రాణాలు బిగబట్టుకొని ఒకనెల ఉప
వాసం వుండు, అంతట దేవి చండి గదా ప్రసన్నురాలు అవు
తుంది.

రాజు.—(నవ్వి) ఎకసక్కెములు నిలుపు. దేవిని ఎట్లు
అలుక దీర్తునో చెప్పు.

ఉ. దిట్టతనాన నవ్వుచు న
దీనతఁ గంఠముఁ గౌఁగిలింతునా?
యట్టె చటుప్రపంచమున
హర్షము నొందఁగఁ జేసికొందునా?
నెట్టనఁ గేలు మోడ్చి పద
నీరరుహంబులఁ ద్రెళ్లి యుందునా?
యెట్టులు దేవియీ సపన
యింపఁగ నౌనొ యెఱుంగ మిత్త్రమా. ౪౧

కావున రా దేవికడకే పోవుదము.

విదూ.—అయ్యా, నీవు పో. నే నేమో చెరలోనుంచి
ఏలాగో తప్పించుకొని వచ్చాను. నేను ఇంటికి వెళ్తాను.

రాజు.—(నవ్వి, మెడ పట్టుకొని బలిమి మెయి మర
లించి) రావోయి మూర్ఖుఁడా. (నడచి, చూచి) ఇదిగో దేవి
దంతవలభియందు కూర్చున్నది. సమీపించెదను.

[అని లజ్జించుచు సమీపించును.

[వాస.—ఆసనమునుండి లేచును.

రాజు.—

ఉ. ఏల దొలంగె దాసనము
నీక్రియ నాకయి? యిట్లు తొట్రుపా
టేలొకొ? లేవఁగావలయు
నే ననుఁ గూరిచి తాంతమధ్యరో ?
లోలకటాక్షపుంగృపకు
లోనగుదాసుని నన్ బ్రపన్ను నీ
వేల మహాదరంబు పచ
రించి విలక్షునిఁ జేసె దిమ్మెయిన్ ? ౮౨

వాస.—(ముఖముం గాంచి) ఇపుడు నీవు వెఱఁగుపడిన వాడవే అయినావు.

రాజు.—ప్రియా, నిజముగా నేను విలక్షుఁడనే, ఏల యన, నా తప్పు ప్రత్యక్షముగా కనఁబడినను, నిన్ను అనుగ్రహము వేఁడ వచ్చినాఁడను.

సాంకృ.—(ఆసనముం జూపి) ఆసనమును అంగీకరింపఁ దగును.

రాజు.—(ఆసనముం జూపి) ఇట ఇట, దేవి కూర్చుండవలయును. [వాస.—నేలఁ గూర్చుండును.

రాజు.—అయ్యో! ఏమి నేలఁ గూర్చున్నదే దేవి! నేనును ఇటనే గూర్చుండెదను. (అని నేలఁ గూర్చుండి) ప్రియా, కరుణింపు కరుణింపు. ఏమి! ప్రణతుఁడ నైనను నామీఁద నిట్లు లోలోపల రోసము దాల్చియున్నావు?

చ. ముడువవు గాని కన్బొమల,
ముగ్ధవిలోచన యేడ్తు వెంతయుఁన్;
వడఁకును మోవియం దడఁతు,
శ్వాసము నూర్చెదు దీర్ఘదీర్ఘముఁన్;
నుడివెదు గాని, నిల్చెదు మ
నోగతి దేనినో చింతసేయుచుఁన్;
అడఁచిన నీదుకిన్క నిభృ
తాహతికై పడి నన్ను నొంచెడిఁన్. ౪౩

ప్రియా౹ కరుణింపు కరుణింపు. [అని పాదముల వ్రాలును.

వాస.—నీ విప్పుడు అతిసుఖంలో మునిగి ఉన్నావు. ఏల దుఃఖంలో బడియున్నదాన్ని వెక్కిరిస్తావు? లే లే ఎవరిక్కడ కోపగించినారు?

సాంకృ.—లెమ్ము, మహారాజా. ఈజోలి యేల? ఈవగపునకు కారణము వేఱే.

రాజు.—(ఆకులపాటుతో) భగవతీ, మఱి యేది?

[సాంకృ.—చెవిలో చెప్పును.

రాజు.—(నవ్వి) అట్లైన వగవ నక్కఱలేదు. నాకును తెలిసినది. అయినను ఒక్కమ్మడిగా ఈ ప్రయోజనము నెఱవేఱినప్పుడే దేవిని అభినందింపనెంచి ఇంత తడవు చెప్పకుంటిని. అంతియగాని నేను ధృఢవర్మవిషయమున అక్కఱలేనివాఁడ నై యుందునా? అచటి వార్త వచ్చి కొంచెము దినములే అయినవి. అచ్చటిస్థితి యిది.

తే. విజయసేనుని మొన మనవిజయసేన
బయటి దేశంబు పట్టఁగాఁ బ్రభవ పోఁడి
దుర్గముఁ గళింగహతకుండు దూరి యందుఁ
గోటగోడయె శరణుగాఁ గొదుకుచుండె. ౪౪

ఆదశలో నున్న యాతనిని,—

ఉ. ముట్టడి కల్కినట్టి తన
మౌల సుభృత్యులు నాఁడునాఁటికిన్
గిట్ట, గజాశ్వము న్మడియ,
క్షీణము గాఁగ సమస్తసైన్యముల్,
పట్టి తదీయదుర్గము స
పాటము సేసి, కళింగుఁ బాదలిన్
గట్టిరొ కొట్టిరో యొకటి
గా వినెదమ్మరో నేఁడొ యెల్లియో. ౪౫

సాంకృ.—రాజపుత్త్రీ, ముందే నేను నీతో చెప్పి యుంటిని గదా, 'వత్సరాజు ప్రతీకారము సేయక యొప్పరికించునా ?' అని.

వాస.—అటయితే నాకు చాలా ప్రియము.

(ప్రతీహారి ప్రవేశించి.)

జయం ఏలినవారికి. ఇదుగో విజయసేనుడు దృఢవర్మ కంచుకితో గూడ సంతోషంచేత కళ్లు చారెడేసి కాగా ప్రియం చెప్పడానికి ద్వారంలో వచ్చి వున్నాడు.

వాస.—(చిఱునవ్వుతో) భగవతీ, ఆర్యపుత్త్రుడు నన్ను చాలా సంతోషపెట్టినాడని నేను తలుస్తున్నాను.

సాంకృ.—వత్సరాజుమీఁద పక్షపాతినిని గదా నేను. నే నేమియు చెప్పను.

రాజు.—త్వరగా ప్రవేశపెట్టుము వారిని.

ప్రతీ.—చిత్తం. [అని నిష్క్రమించును.

(అంతట విజయసేనుండును కంచుకియు ప్రవేశింతురు.)

విజ.—అయ్యా కంచుకీ, ఇపుడు ఏలినవారిని చూచెదను గదా అని, అది యేమో సాటిలేని సంతోషాతిరేకమును అనుభవించుచున్నాను.

కంచు.—సత్య మిది. వినుము ;

క. ఒండువగనేని దొరఁ గను
పండువు సేసికొనుభటుఁడు ప్రమదజడుఁ డగున్,
దండిపగఱ దొరయాసతోఁ
జెండిన వీరవరుమాట చెప్పవలయునే ! ౪౬

ఇరువురు.—జయము ఏలినవారికి.

[రాజు ఇరువురనుం గవుంగిలించును

కంచు.—దేవ, ఆహా నీకు మేలైనది.

క. పొలియించి ఘాతకళింగుని,
నెలకొల్పి మదీయవిభుని నిజరాజ్యములో,
నిలలోన విజయసేనుఁడు
నిలిపెన్ వీరాగ్రగుండు నీశాసనమున్. ౪౭

వాస.—భగవతీ, ఆనవాలు పట్టినావా ఈకంచుకిని ?

సాంకృ.—ఆనవాలు పట్టకేమి? ఇతనిచేత నిచ్చిరియే గదా మీాపినతల్లి నీకు బొమ్మల జతను పంపినది.

రాజు.—బలారే! విజయసేనుఁడా! గొప్ప కార్యము నెఱవేర్చితివి!

[విజ.—పాదములందు వ్రాలును.

రాజు.—దేవి, ఆహా! నీకు మేలు. దృఢవర్మ మరల రాజ్యమందు నెలకొన్నాఁడు.

వాస.—(హర్షముతో) అనుగ్రహము చేసితివి.

విదూ.—ఇట్టి గొప్పశుభంలో ఇటువంటి రాజకులంలో చేయవలిశింది ఏమంటే (రాజును చూపి వీణావాదనము నభినయించుచు) గురుపూజ, (తనజన్నిదమును చూపుచు) బ్రాహ్మణుడికి సత్కారం, (ఆరణ్యకను సూచించి) చెరలోనివాళ్ల నెల్లవిడిపించడమున్ను!

రాజు.—(వాసవదత్తనుండి అపవారించి చిటికవేయుచు) సరి వయస్యుఁడా సరి.

విదూ.—అమ్మా, ఈవిషయంలో ఏమి యానతిస్తావు?

వాస.—(సాంకృత్యాయనిం గాంచి లేఁతనవ్వు నవ్వుచు) ఈ చెడిబదికినవాడిమూాలంగా ఆరణ్యకకు విడుదల అయినది.

సాంకృ.—పాపము! దానిని చెఱ నుంచిన నేమి ప్రయోజనము?

వాస.—భగవతియిచ్ఛ ఏలాగో ఆలాగు.

సాంకృ.—అట్లని నేనె దానిని విడిపించెదను.

[అని నిష్క్రమించును.

కంచు.—ఇట్లును మఱి మహారాజు దృఢవర్మ సందేశించి నాఁడు, 'నీదయచేత సర్వమును కోరినట్లు నెఱవేఱినది, కావున ఈప్రాణములు నీయవి. నీయిచ్చ వచ్చినట్లు వీనిని పనిగొన నీవే ప్రమాణమవు.' అని. [రాజు లజ్జతో మొగము వాంచును.

విజ.—దేవా, ఏలినవారిపై దృఢవర్మకుం గల ప్రీతి విశేషము చెప్ప నలవి గాదు.

కంచు.—'నీకు నే నిచ్చిన మాకొమారిత ప్రియదర్శిక అగపడకపోయినందున నీతో సంబంధము ఘటిల్లదాయె నని నాకు వంత బల మైనను వాసవదత్తను నీవు పెండ్లియయినందున అదియును తీఱినదే.' అని.

వాస.—(బాష్పములతో) అయ్యా కంచుకీ, నాచెల్లెలు ఏ లాగు అగపడక పోయింది?

కంచు.—రాజపుత్త్రీ, కళింగహతకుని యాముట్టడిలో అంతిపురిజనులు ఎక్కడికెక్కడికో పరారి కాఁగా, నేను పుణ్య వశమున ఆమెను గాంచి అట్టిసమయములో అక్కడ ఆమె యుండఁదగ దని తోడ్కొని వత్సరాజుకడకు తరలితిని. అనంత రము ఆమెను వింధ్యకేతువుచేతిలో నుంచి స్నానమునకు వెడలి తిని. మరలి వచ్చునంతలో ఎవరో ఆచోటిని వింధ్యకేతునిం గూడ కథామాత్రశేషముగా నొనర్చిరి.

రాజు.—(చిఱునవ్వుతో) విజయసేనా, ఏమి చెప్పెదవు?

కంచు.—అచట వెదకియు ఆమెను కానవైతిని. అప్పటి నుండి యిప్పటికిని తెలియలేదు ఎట నున్నదో.

(అంతట మనోరమ ప్రవేశించును.)

మనో.—దేవీ, ఆదీనురాలు ప్రాణసందేహంలో నున్నది.

వాస.—(కన్నీళ్లతో) ఏమి నీవు మా ప్రియదర్శన వార్త నెరుగుదువా?

మనో.—ప్రియదర్శనవార్తను నే నెరగను. ఇదే యారణ్యక తేనె అని మిష పెట్టి విషం తాగి ప్రాణసందేహంలో ఉన్నదని నేను విన్నపం చేసుకొన్నాను. కావవలెను దేవీ కావవలెను.

[అని యేడ్చుచు పాదముల వ్రాలును.

వాస.—(స్వగతము) అయ్యయ్యో! ఈయారణ్యికా వృత్తాంతంచేత ప్రియదర్శనదుఃఖం అంతరించింది. లోకులు అతి దుర్జనులు, ఒకవేళ నన్ను వేరువిధంగా తలిచినా తలుస్తారు. కనుక ఇప్పుడు తగినపని యిది. (ప్రకాశము, ససంభ్రమము) మనోరమా, శీఘ్రంగా ఇక్కడికే దాన్ని తేవే, నాగలోకాన విషవైద్యం నేర్చుకొన్నవాఁడు ఆర్యపుత్త్రుడు ఇందుకు సమర్థుడు.

[మనోరమ నిష్క్రమించును.

(అంతట మనోరమ ఆదుకొనఁగా, విషవేగము

అభినయించుచు ఆరణ్యక ప్రవేశించును.)

ఆర.—చెలీ, మనోరమా, ఎందుకు నన్ను చీకట్లోకి తీసుకపోతున్నావు?

మనో.—(వగచుచు) అయ్యో అయ్యో! దీనికంటికి కూడా విష మెక్కింది. (వాసవదత్తను చూచి) దేవీ, త్వరగా రక్షించు రక్షించు. మిక్కుట మయింది దీనివిషం.

వాస.—(తత్తరముతో రాజును చేయిపట్టుకొని) ఆర్యపుత్రా, త్వరగా లే, పాపం ఇది అడగారుతూ వుంది.

[అందఱు చూతురు.

కంచు.—(చూచి) ఈమె రాజపుత్రిని ప్రియదర్శనను కేవలముపోలియున్న దే! (వాసవదత్తను ఉద్దేశించి) రాజపుత్రీ, నీకు ఎక్కడిది యీకన్యక?

వాస.—అయ్యా, వింధ్యకేతునికొమారిత. అతణ్ని పొలియించి విజయసేనుడు తెచ్చినాడు.

కంచు.—అతనికి కూఁతు రెక్కడిది? ఆ రాజపుత్త్రియే యీమె. అయ్యో, చెడితినిరా మందభాగ్యుఁడను! (నేలఁగూలి, లేచి) రాజపుత్రీ, ఈమె ఆప్రియదర్శిక! నీచెల్లెలు, అస్తమింపనున్నది.

వాస.—ఆర్యపుత్రా, కావు కావు! నాచెల్లెలు అంతమొందు తున్నది.

రాజు.—ఊఱడిల్లుము ఊఱడిల్లుము. ఇదె చూతము. కటకటా! కటకటా!

తే. క్రమముగాఁ దేనె నిండంగఁ బ్రమద మారఁ
బోయెఁ దేఁటియుఁ దామరమొగ్గఁ గ్రోల,

మంచునుం బడి దానిని మూపఁ జొచ్చె,
విధి విరోధింపఁ గోర్కు లెవ్విధి ఫలించు! ౮౮

మనోరమా, అడిగి చూడు 'నీ కే మేని తెలియుచున్నదా?' అని.

మనో.—సఖీ, నీ కే మైనా తెలుస్తూ వున్నదా? (కన్నీళ్లతో మఱల కదలించుచు) సఖీ, అడుగుతున్నాను గదా 'నీ కే మైనా తెలుస్తున్నదా?' అని,

ప్రియ.—(అస్పష్టముగా) ఈయవస్థకు వచ్చినా నాకు మహారాజు కనబడకున్నాడు.

[అని సగముమాటలో నేలఁ గూలును.

రాజు.—

చ. కలికికిఁ గన్ను మూఁతవడెఁ
గ్రమ్మెను జీఁకటి నాకు దిక్కులన్;
నిలిచెను శ్వాస మింతికి, వి
నిర్గతచేష్టిత మయ్యె నాయొడల్;
ఎలుఁగు నిరుద్ధ మయ్యెఁ జెలి,
కింకెను నానుడి నాదుకుత్తుకన్;
దలఁప విసంబె బాలకు వె
తల్సకలంబులు నాకె వాటిలెన్. ౮౯

వాస.—(కన్నీళ్లతో) ప్రియదర్శనా లేవే; ఈయనే మహారాజు నీయెదట నున్నాడు; నేను తెలియక యేమి తప్పు చేసితినో ఇంత కోపగించి నాతో పలకవు? మన్నించు మన్నించు. ఇక తప్పు చెయ్యను జుమా. (మీఁదు చూచి) అయ్యో! పాడు

దైవమా! నే నిపుడేమి తప్పు చేసితిని, నాచెల్లెలిని ఈయవస్థకు తెచ్చి చూపించితివి ? [అని ప్రియదర్శికమీఁద పడును.

విదూ.—వయస్యుడా, ఏమి నీవు జడంగా ఊరు కున్నావు? ఇది దిగులుకు కాలంగాదు; విషగతి కుటిలం గదా; కనుక చూపు నీవిద్యాప్రభావం.

రాజు.—నిజమే యిది. (ప్రియదర్శికను జూచి) మూఢుఁడనే అయితిని ఇంతసేపు; మఱి యీబాలను బ్రదికించెదను. నీళ్లు నీళ్లు.

విదూ.—(వెలి కేఁగి మరల వచ్చి) ఇవిగో నీళ్లు.

[రాజు ఆచమనముచేసి ప్రియదర్శికపై చేయి యుంచి మంత్రస్మరణము నభినయించును. ప్రియదర్శిక క్రమముగా లేచును.]

వాస.—ఏమి నాపుణ్యం! నాచెల్లెలు బ్రదికినది!

విదూ.—ఆహాహా! ఏలినవారి విద్యాప్రభావము!

కంచు.—అహాహా! దేవరవారిన రేంద్రత అంతటను అడ్డు లేనిదిగా నున్నది!

ప్రియ.—(లేచి కూర్చుండి అవులింత నభినయించుచు అస్పష్టముగా) మనోరమా, చాలా సేపు నిద్రపోయినానే.

విదూ.—వయస్యా, నీమంత్రవాదిత్వం రూఢికెక్కిం దోయి.

[ప్రియ.—ఆసతో రాజుం గాంచుచు లజ్జతో కొంచెము మొగము వాంచును.]

వాస.—ఆర్యపుత్త్రా, ఏమి ఇది యింకా వేఱు విధంగానే యున్నదే!

రాజు.—(లేఁత నవ్వుతో)

ఆ. చూపు పసిగ లేదు; స్ఫుటత చాలదు మాటఁ;
దనువు డయ్యు, గగురు కొనుఁ, జెమర్చు;
చన్నుఁగవకు వణఁకు సంధించుఁ గ్లేశంబు;
కాన నబల కింకఁ గలదు విషము. ౫౦

కంచు.—(ప్రియదర్శిక నుద్దేశించి) రాజపుత్త్రీ, వీఁడే మీ నాయనగారి కింకరుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

[అని పాదములం ద్రెళ్లును.

ప్రియ.—(చూచి) ఏమీ! కంచుకి ఆర్యవినయవసువా! (బాష్పములతో) అయ్యో నాయనా, అయ్యో అమ్మా!

కంచు.—ఏడువకు, వత్సరాజు ప్రభావముచే నీతలిదండ్రులు క్షేమముగా నున్నారు. వెండియు మునుపటియట్లే రాజ్యము నేలుచున్నారు.

వాస.—(బాష్పములతో) రావే మాయలాడీ, ఇప్పుడైనా చెల్లెలిచెలిమిని జూపవే. (కంఠమునం గవుఁగిలించి) ఇప్పుడు ఊరడిల్లితిని.

విదూ.—అమ్మా నీవు చెల్లెలిని మెడలో కాగిలించుకొని యీలాగ పరమానందంలో వున్నావు. వైద్యుడికి బహుమానం మరిచినావు.

వాస.—వసంతకా, మరవలేదు. (రాజు నుద్దేశించి, మందహాసముతో) వైద్యుడా, చెయ్యి చాపు, నాచెల్లెలి ముంజేతిని నీకు బహుమాన మిస్తాను.

[రాజు చేయి చాచును; వాస.—ప్రియదర్శికా హస్తమును అర్పించును.

రాజు.—(చేతిని విసర్జించి) ఏల యీకన్య? ఇప్పుడే యెట్టకేలకు ప్రసన్నురాల వైతివి.

వాస.—నీ వెవరవు పుచ్చుకోకపోవడానికి? ముందుగానే నాయన దీన్ని ఇచ్చినాడు.

విదూ.—మాననీయురాలోయి దేవి, ఆమెకు ప్రతికూలం చెయ్యకు.

[వాస.—రాజుచేతిని బలాత్కారముగా తివిచి ప్రియదర్శిక నిచ్చును.

రాజు.—దేవి యేలుచున్నది. దేవి చిత్తమును దాటుట కేటిసామర్థ్యము.

వాస.—ఆర్యపుత్రా, ఇంకా ఏమి ప్రియం చేయవలెను.

రాజు.—ఇంతకు పయిగా ప్రియము ఉండునా? చూడు—

ఉ. మానితరీతిఁ బొందె నిజ
మండలముఁ దృఢవర్మ వెండియున్;
బూనినకిన్క నీవు విడి
పొందితి విప్పుడె నాపయిఁ గృపన్;

ప్రాణము దక్కి నన్నుఁ జెలి
యల్ ప్రియదర్శిక గూడె; నింకనున్
దేనిని వేఁడఁగా వలయుఁ
జెల్వఁగదే మఱి జీవితేశ్వరీ. ౫౧

అయిన నిది యగుఁగాక.

(భరతవాక్యము.)

ఉ. వాసవుఁ డిష్టవృష్టుల న
వారిగఁ బాఁడియుఁ బంటఁ బెంచుతన్;
భూసురు లిష్టులన్ సుకస
మూహములం దనియింత్రు గావుతన్;
వాసిగ సాధుసంగమము
వర్ధిలుఁ గావుత శాశ్వతంబుగా;
నాసిలుఁ గావుతన్ ఖలుల
నాల్కలు నాలెడుపాడుకొండెముల్. ౫౨

చతుర్థాంకము ముగిసినది.

---

ప్రియదర్శికా నాటిక

సమాప్తము.

---

శ్రీ

# ప్రియదర్శికా నాటిక

## కఠినపద్యములకు తాత్పర్యము.

---

౧. వివాహహోమ విధియందు పొగచేత చూపులు కలఁత పడినను చంద్రకిరణములచేత కన్నులు సుఖపడఁగా, మరల పెండ్లికుమారుని తమకముతో చూచుచు బ్రహ్మవలన ఎక్కుడు సిగ్గుచేత మోము వాంచినదై, (అద్దమువంటి) తన కాలిగోటి యందు నెత్తిమీఁది గంగతోఁ గూడ ప్రతిబింబించిన శివునిమీఁద ఈసు దాల్చియు, (ఆయనచేతి) తాఁకుడుచేత గగుర్పాటునొట్టి గౌరి మీకు మంగళము సేయుఁగాక.

౨. రావణుఁడు ఎత్తినంతట కైలాసపర్వతము తూలుచుండఁగా, ప్రమథులకు కుతూహలము ఉప్పొంగుచుండఁగా, కుమారస్వామి తల్లి బ్రోమ్మునం జొరఁగా, వాసుకి కోపముతో పరికించుచుండఁగా (శివుఁడు) కాలితో అదిమినంతట రావణుఁడు దేహముక్రుంగి పాతాళము నడుకునకు పోవుచుండఁగా, (రావణునిమీఁద) కోపముతో నున్నవాఁడయ్యును, పార్వతి భయమువలన బిగువుగా తనదేహమును కవుంగిలించినందున ఆనందించిన శివుఁడు మిమ్ము రక్షించుఁగాక.

3. శ్రీహర్షుఁడు నేర్పరియైన కవి, ఈసభయు గుణమును గ్రహించునట్టిది, వత్సరాజుకథయో లోకమందు మనోహరమైనది, మేమును నాట్యమందు సమర్థులము. ఈప్రతిదియు కోరిన ఫలము లభించుటకు కారణమైయున్నది; ఇంక నేమి! నాయదృష్టాతిశయమువలన నిదే సమస్తగుణముల సముదాయము సమకూడినది.

౫. గట్టిచెఱనుండి విడివడి వాసవదత్తను హరించి మహోత్కర్షను పొంది తనరాజధానిం జేరి వత్సరాజు ఎట్లు ప్రతాపించుచున్నాఁడో, అట్లే ఈసూర్యుఁడు మేఘముల యావరణమునుండి విడివడి కన్యారాశిం గూడిన యనంతరము తులారాశిం జేరి తనపూర్వతేజస్సును మరల పొందినవాఁడై మిక్కిలి ప్రకాశించుచున్నాఁడు.

౬. త్రికరణశుద్ధిగా ఆచరించిన ధర్మమువలననుంబోలె నాకు చెఱవలన సకలశ్రేయమును కలిగినవి,—ఎట్లనఁగా,—నాసేవకులు నాకై పడినపాటువలన వారికి నాయందుభక్తి తప్పమి నాకు తెలియనయినది, నన్ను చెఱనుండి విడిపించుటకు యౌగంధరాయణాదిమంత్రులు చేసిన యద్భుతోపాయములవలన వారి ప్రజ్ఞావిశేషము నాకు అనుభవమునకు వచ్చినది, మిత్రులయొక్క మైత్రియు తేటపడినది, ప్రజలకు నాయందుఁ గలయనురక్తి మిక్కిలి తెల్లమయినది, రణములో వాసవదత్తాబంధువుల నోడించి యాసుందరిని తెచ్చితిని గావున నారణక్రీడాతూహలము నెఱవేఱినది, లోకోత్తరయైనకన్య నన్ను వలచి నాకుదొరకినది.

౮. చీఁకటిచేత చొరరాని చెఱను లెక్కింతువుగాని ఆసుందరియొక్క ముఖచంద్రప్రభను లెక్కింపవు; సంకులశబ్దముచేత నీకు బాధ కలిగెనేగాని ఆకోమలియొక్క మధురవాక్కులు గణనకు రావాయెను; క్రూరులయిన చెఱకాపరులను తలపోసెదవేగాని చెలిమిరియొలికెడి యాక్రేగంటి చూపులను తలంపవు; నాస్వాతంత్ర్యమును పోఁగొట్టిన యామోసమును దలఁచెదవేగాని ఆచెలిసావాసమును ఎంచకున్నావు, చెఱయొక్క దోషములనే ఎన్నెదవుగాని వాసవదత్తయొక్క గుణములను ఎన్నవు.

౯. తాను కాలరియై మొట్టమొదట కాలరిదండును తొమ్మిత్రోపులమాత్రాననే నుగ్గుచేసి, బాణపరంపరచే గుఱ్ఱపుదండును బెదరిన లేటితండమో యనునట్లుగా దవ్వులకు తఱిమి, ఎల్లయాయుధములను ఎల్లయెడలను విసరివైచి, చరాలున కత్తి దూసి, యనంతరము ఏనుఁగుదండులో అరఁటితోఁటం గోయు నాటను ఆడం దొడంగెను.

౧౦. ఈరీతిగా యుద్ధములో అసహాయుండ్రైయు మన మూఁడంగములబలమును చీకాకుపఱిచి కత్తిని ఎగుబుజమున మోపుకొని దానినుండి నెత్తురు బుజమును కమ్ముచుండఁగా ఆయుధముల గాయములు నూర్లకొలంది ఒమ్మును చక్కఁడఁగా బడలి ఎట్టకేలకు వింధ్యకేతువు కూలెను.

౧౧. దేవా, సవిలాసమైన నీమంగళస్నానమునకై వలయుగిండులను గంధచూర్ణమును అంతఃపురవారవిలాసిను

లెల్లరును సమకూర్చుచున్నారు. ఆబడలికచేత సన్నని పైఁట జాఱఁగా కుచములు మఱుఁగుతొలఁగిన లావణ్యముతో ప్రకాశించుచు స్నానభూమికి అలంకారముగా నున్నవి. వానిచేత, స్నానభూమి, వారు తెచ్చియుంచిన బంగారు కలశముల కంటె వేఱుగా తానును నీస్నానమునకై బంగారుకలశములను ఎత్తినదో యనునట్లుతోఁచుచున్నది.

౧౫. ప్రియ నన్ను వలచిన తొలితొలి దినములలో ఆవలపుచేత కృశించి, ఎక్కున మండనము లొల్లక మంగళ మండనములు మాత్రము దాలిచి, సగము అలసతతో సగమే పలుకుచు, మొగము కొంచెపాటిపాండిమను దాల్చి ప్రభాత చంద్రుని యొప్పును మించి సొంపారఁగా, కోర్కిగలదై నాకు నేత్రోత్సవము చేసినది. ఆదశలో ప్రియను వెండియుం గాంచు భాగ్యము చేకూరదు గావునను, వ్రతోపవాసముచేత నిపుడు అట్టిదశయే కలిగియున్నందునను, ఈదశలో నున్నప్రియను ఇపుడు చూచి ఆదశలోనే మరలం గాంచినట్లు ఆనందమొందఁ గోరెదను.

౧౬. రాలియున్న వావిలి తొడిమలు కమ్మియున్న నేల చిన్న చిన్న పగడపు మోసులతో అలంకరింపఁబడినట్లు ఒప్పుచున్నది; ఏడాకులయరఁటిపువ్వుఁదావి మనదెసకుకొట్టుచు పరికానిమదంపుగాటువాసనయను భ్రమను కలిగించుచున్నది.

౧౭. దిరిసెన పువ్వులవలె కోమల మయిన పచ్చికచేత మెత్తనిదై యీనేల యిప్పుడేకడిగిన పచ్చల చూర్ణముతో ఇప్పుడే యిట నెలకట్టు కట్టిరో యనునట్లు శోభిల్లుచున్నది.

మఱియు ఇప్పుడే తొడిమలనుండి రాలిన మంకెనపువ్వుల మొత్తములచేత ఈనేల వర్షర్తువు దాటిపోయినను ఇంకను ఆరుద్రపురుగులు వందలు వందలుగా రాలి అంతటను మూగి యున్నవో యనునట్లు ప్రకాశించుచున్నది.

౨౨. చంద్రమూర్తివలె, కన్నులకు, ఎడతెంపులేక కనులలో కురియు నమృతవర్షము ఎట్టిప్రీతిని చేయునో, అట్టిప్రీతిని చేయుచున్నదియు, మేఘమనెడితెర తొలంగుచుండఁగా క్రమక్రమముగా ఎట్లు చంద్రమూర్తి చెప్పనలవిగాని దర్శనీయతను పొందునో అట్లే పయ్యెద జాఱుచుండ నించించుకగా పాలిండ్ల దర్శనము చేత చెప్ప శక్యముగాని నేత్రోత్సవము నిడుచున్నదియు, నయిన యీరమణియొక్క చేతిశాఁకుడునకు చంద్రమూర్తి యొక్క కిరణముల శాఁకుడునకుం బోలె పాత్రము లయ్యును ఈ కమలములు వెంటనే ముకుళింపమియే అద్భుతముగా నున్నది.

౨౩. ఓ వెఱిపరీ, వగవకు: ఈతుమ్మెదలు నీమోముఁ దమ్మిపై దానినెత్తావి నానుటకై మూఁగుచున్నవి. (వీనిని నేను తోలుచున్నాను.) నీవిట్లు మిక్కిలి బెదరి వీనిం గాంచుచు నీవెడందకన్నులథాళధళ్యమును నలుదెసలం బర్వింపకుము; ఏలయన, అట్లు పర్వినయాథాళధళ్యము కలువతండ మని భ్రమసి మఱి యీతుమ్మెదలు నిన్ను వదలనే వదలవు.

౨౪. నాప్రియతమువలె పగటిశోభ పద్మవనకాంతిని కైకొని యేఁగినది; నాహృదయమునందుంబోలె సూర్యబింబము

నందు రాగము (అనురాగము-ఎఱుపు) ఎక్కువగా నగపడు చున్నది; నావలెనే ఈ జక్కవయు చెలిని తలపోయుచు తామరకొలనిగట్టున నున్నది; నాకుంబోలె లోకమునకును తటాలున దిక్కులు చీఁకట్లు అయినవి.

౨౮. ఎడలేక పడుచున్న మదనబాణశతముల ఝూత్కారశబ్దమో యనునట్లుగా నిట్టూర్పుల మిషచేత రేయుంబవలు నీయనురాగము వెలువడుచున్నది.

౨౯. రత్నములవందలచేత వెలుగొందిన బంగారుకంబములందు కట్టఁబడిన పెద్దముత్తెసరములచే రమణీయంబును అచ్చరల గెలిచిన గుబ్బెతలచేత అధిష్ఠితంబును అగు నీ నాటకశాల దేవతల యాకాశయానమునకు తుల్యముగా ప్రకాశించుచున్నది.

30. ఇచట దేవేరుల యూడిగంపుఁజేడియలు సయితము, పాదములందు అందియలు, విశాలమయిన పిఱుందుపై మ్రోఁగు చున్న మొలనూలును, చనుగట్టులపై వెలుఁగులు చల్లుముత్తెపుఁ జేరులును, బుజములందు అంగదములును, వీనులయందు కమ్మలును, చేతులందు కడియములును, తలకట్టునందు స్వస్తికంబును దాల్చినవారై అగపడుచున్నారు.

33. నేత్రానందాధారభూత మయిన యీరూపము వత్సరాజురూపమే, వెలుఁగొందుచున్న యీ వేషము ఆయన వేషమే, మదఘ్నయేనుఁగునడక వంటి యీనడక ఆయననడకయే, మిక్కిలి ప్రౌఢ మయినయీ గాంభీర్యము ఆయనదే, ఈ విలాసము

అతనిదే, నీటితో నిండియున్న మేఘముయొక్క యుఱుము వంటి యీ ఎలుంగును ఆయనయెలుంగే, నేర్పరి యీమనో రమ మనకు సాక్షాత్తుగా వత్సరాజునే చూపినది,

౩౮. రాజహంస మేఘములపేర్పుచే ఆక్రాంత మయిన యాకసముం గాంచినదై తన ప్రియను తోడ్కొని తన నివాస మయిన మానససరస్సును చేర్పుటకు కోరుచున్నది.

౩౯. తుమ్మెదకొమ్మ క్రిం చయిన మదనుని మూలమున క్రొత్తవలపుచేత గెంటఁ బడినదై తనకు కన్నులవిం దయినకాం తుని చూడఁగోరి అలయుచున్నది.

౩౬. ఈపాటయందు పదివిధముల వ్యంజనధాతువుల చేతను వ్యక్తి కలిగినది. ద్రుతము మధ్యము విలంబితము నని ముత్తెఱఁగుల భిన్నమైయుండు నీలయ స్పష్టపడినది; గోపుచ్ఛము లోనగు మూఁడుయతులును క్రమముగా చూపఁబడినవి; తత్వము, ఓఘము, అనుగతము, నను వాదనప్రకారములు మూఁడును చక్కఁగా చూపఁబడినవి.

౩౭. నాచేతిలోని యిది మంచుబొట్లు ఇప్పుడే కూడుట చేత చలువచల్లుచున్న తామరమొగ్గ యగునా యేమి? నైసర్గిక మైన యీ యాహ్లాదకరత్వము వేకువనే ఎండ ద్రావునదైన తామరమొగడకు ఉండ దని తలంచెదను. మఱి ఇట్లు మంచు ముత్తమును గురియుచున్నదే! జాబిల్లియా? ఇసీ, ఏమి! ఆజా బిల్లియు క్రాఁచువాఁడే! తెలిసినది! ఇది చేయి, చెమరునెపమున తెంపులేక అమృతము గురియుచున్నది.

౩౭. నీ విపుడు నాహృదయమున (శిరమునను, మనస్సులోను) లేఁత పవడపుఁ జివురుయొక్క జిగిని హరింప జాణయయిన యీనీచేతితో రాగమును (ఎఱ్ఱఁదనమును, అనురాగమును) ఉంచితివి.

౩౮. నీచూపు స్నేహమును చూపుచున్నను కన్నుల కాంతి యెఱ్ఱగా నున్నది, నీ వాక్కు మధురముగా నున్నను డగ్గుత్తికపడి ప్రతిమాటలోను తొట్రుపడుచున్నది., నిట్టూర్పులు నీ వెంత యణఁచుకొన్నను పాలిండ్లయుబుకులాటచేత తెలియనగుచున్నవి, పై యనుగ్రహముచేత నీ వెంత దాఁచినను నీకోపము స్పష్టముగా అగపడుచునే యున్నది.

౩౯. జాబిల్లికి ఏల యిపుడు బొమముడులతో మచ్చ కల్పించెదవు? ఏల అదురుచేత మోవిని గాలికి కరము అల్లలనాడు మంకెన పూవుసాటిం బొందించెదవు? పాలిండ్లబరువునకే ఎంతయు వణఁకుచున్నది యీకొను, ఇంక వేఱు గాసియు నేల? కోపము మానుము; నీచిత్తమునే పడయువాఁడనై నేను ఇట్లు ఆడితిని.

౪౦. నేను, ఎట్టయెదుట, కోపముచే చెమర్పుచు భయంకరముగా బొమలు ముడి వైచియున్న దేవీముఖమును, భయముచేత ఎగిరి యెగిరి దాఁటుచున్న యాఁడులేడి కనుఁగలువలవలె చంచలము లయినకనుఁగలువలు గలదైన ప్రియాముఖమును, చూచుచు తత్క్షణమే, ఏకకాలమందే భయపడినవాఁడను, ఉత్కంఠితుఁడను, రెండును అయి మహాకష్టము పాలైతిని.

౪౨. ఏల యాసనమును వదలేదవు? నాయెడల (ఈ) తొట్రుపాటేల; నీ నడుము డస్సి యున్నది, నాకై యిట్లు లేచుట సరిగాదు; ఒక్కమాఱు కటాక్షించితివేని వశ్యుం డయ్యెడి యీ జనుని అత్యాదరముచేత ఏల వెఱగుపటి చెదవు?

౪౩. ఓవామలోచనా, బొమలు ముడివైవవుగాని, మాటిమాటికి ఏడుపను మాత్ర మేడ్చెదవు; మోవి యదురుట లేదు గాని సదా నిట్టూర్పులను నిగుడ్చుచు నే యున్నావు; మాట మానవుగాని, ఏమో ఆలోచనతో నెమ్మోము వాంచి యున్నావు; నీ గూఢకోపము పైకగపడని దెబ్బవలె నన్ను కరము నొగిలించుచున్నది.

౪౪. ఈచెలి కనుంగవ మూంతపడుచున్నది, నాకు దిక్కులు చీఁకట్లు అయినవి; ఈ చెలికి గొంతు అడుచుకొను చున్నది, నాకు ఇవె మాటలు కష్టముగా వెలువడుచున్నవి; ఈ చెలికి ఊర్పు నిలిచిపోయినది, నా దేహము చేష్ట లుడిగినది; ఈ చెలికి విష మెక్కుటమాత్ర మే అనియు, దుఃఖ మంతయు నాకే అనియు, తలంచుచున్నాను.

౫౨. కోరినవర్షముఁ గురియుచు ఇంద్రుఁడు భూమిలో మిక్కుటముగా పయిర్లు పండించునుగాక, బ్రాహ్మణశ్రేష్ఠులు యజ్ఞములచే యథావిధిగా దేవతలకు ప్రీతి యొనర్తురుగాక తగినదైన సజ్జనసాంగత్యము కల్పముతుదివఱకును మిక్కిలి దృఢ మగుఁగాక, జయింపరాని వజ్రలేపము లగు కొండెగాండ్ర వాక్కులు సంపూర్ణముగా శమించునుగాక.

---

# ప్రియదర్శికా నాటికకథ

ఉదయనుఁడు వత్సదేశపురాజు, యువకుఁడు, అవివాహితుఁడు, మహాపరాక్రమశాలి. పైగా బాల్యములో సంపాదించిన ఘోషవతి యను వీణను వాయించుచు సంగీతవినోదము నొందుచుండువాఁడు. కౌశాంబి ఇతని రాజధాని. ఇతనిని తమకు అల్లునిగా చేసికొనుటకు పెక్కురు రాజులు ఉవ్విళ్లూరుచుండిరి.

అట్టివారిలో అతని శత్రువు, చండమహాసేనుఁడు ఉజ్జయినీపతి, అవంతిరాజు ఒకఁడు. ఈయనకొమార్తె వాసవదత్త. రెండవవాఁడు అంగదేశాధీశ్వరుఁడు దృఢవర్మ. వీరిరువురును షడ్డకులు. దృఢవర్మ రాణి చండమహాసేనుని రాణికి చెల్లెలు. దృఢవర్మ కొమారిత, కథానాయిక ప్రియదర్శిక వాసవదత్తకు చెల్లెలగుచున్నది.

కళింగదేశపురాజు ప్రియదర్శికను తనకిమ్మని యడుగుచున్నను లక్ష్యము చేయక దృఢవర్మ తన కొమార్తెను వత్సరాజునకు వాగ్దానము చేసెను. అందులకు కాళింగుఁడు దృఢవర్మమీఁద పగఁబట్టి యుండెను.

ఇంతలో వత్సరాజును చండమహాసేనుఁడు మోసముగా యంత్రగజముచేత చెఱబట్టి తనకొమార్తెకు సంగీతము నేర్పుమని నియమించెను. ఆసాకుచే అతనిని అల్లుని చేసికొనఁదలఁచెను. వత్సరాజు చెఱలోపడినందున కాళింగుఁడు సాహసించి దృఢ

వర్మ మీఁదికి దండెత్తివచ్చి కోటను ముట్టడించెను. ఆ గందర గోళములో దృఢవర్మ కంచుకి వినయవసువు, ప్రియదర్శికను కాపాడుటకై ఆ ఘోరమైన ముట్టడినుండి ఆమెను ఎట్లో తప్పించి తెచ్చి, దృఢవర్మ మిత్రుఁడైన అడవిదొర వింధ్యకేతుని యింటనుంచి, స్నానార్థము, ఆసమీపమందలి అగస్త్యతీర్థమునకు పోయెను.

ఈలోపల వత్సరాజు వాసవదత్తను హరించి, తనయూరు చేరి తన శత్రువైన వింధ్యకేతువును జయించుటకు గొప్ప దండుతో విజయసేనుఁడను సేనాపతిని పంపెను. ఆసైన్యము సరిగా దృఢవర్మకంచుకి స్నానముచేసి వచ్చులోపల, వింధ్య కేతువును ముట్టడించి, ఆతనిని యుద్ధములో చంపి, ఆతని పల్లెను నాశము చేసెను. అప్పుడు ప్రియదర్శిక తన్ను కాపాడు వారులేక అంగలార్చుచుండఁగా విజయసేనుఁడు చూచి, ఆమె ఎవరో తెలియనందున, వింధ్యకేతువు కొమార్తెయని తలఁచి తనతోకూడ కౌశాంబికి కొనిపోయెను.

స్నానమునకు పోయినకంచుకి మరలి వచ్చి, ఈ కొద్ది కాలములో ఇంత ఆపద వింధ్యకేతువునకు కలిగినందులకు దుఃఖించి, రాజపుత్త్రిని ప్రియదర్శికను వెదకి, కానక, దుఃఖముతో మరల తన ప్రభువుకడకే పోయెను.

ఈ లోపల కళింగరాజు దృఢవర్మను పట్టుకొనిపోయి సంకెళ్లు వేయించెను. ప్రియదర్శికను విజయసేనుఁడు కొనిపోయి ఆమె వింధ్యకేతుని కూఁతురనియు తమకు దొరకినదనియు వత్స

రాజునకు నివేదింపఁగా, వత్సరాజు ఆమెను చూడకయే తన రాణి వాసవదత్తకడకు పంపి చెల్లెలివలె చూడవలసినదనియు, ఎప్పుడు వివాహయోగ్య యగునో అప్పుడు తనకు తెలుపవలసిన దనియు నాజ్ఞాపించెను.

ఇంతలో దృఢవర్మను కళింగుఁడు చెఱబెట్టినాఁడని వత్సరాజునకు తెలిసినది. వెంటనే అతఁడు మరల విజయసేనుని దండుతో కళింగదేశముమీఁదికి యుద్ధమునకు పంపెను.

ప్రియదర్శిక తా నెవరో చెప్పుకొననందున, అడవిలో దొరకినందున, ఆమెకు ఆరణ్యక యని పేరాయెను. వాసవదత్త ఆమెను సగౌరవముగా కాపాడుచుండెను. ఒకప్పుడు వత్సర జు ఉద్యానవనములో ఆరణ్యకను తొలిసారి చూచి, ఆమెయే వింధ్యకేతుని కొమార్తెయని గ్రహించి మెల్లగా సమీపించి పలుకరించును. ఇరువురును పరస్పర ప్రీతివహింతురు. ఆరణ్యక అతఁడే వత్సరాజని గ్రహించి తన తండ్రి సరియైన వానికే తన్ను ఉద్దేశించెనని సంతోషించును. తర్వాత వాసవదత్తస్వాధీనమందున్న యాకన్యను సందర్శించుటకు రాజు విదూషకుని సహాయముతో ప్రయత్నించును. ఆరణ్యకయు రాజును ప్రేమించి విరహవేదన పడుచుండును.

ఇంతలో అంతఃపురములో సాంకృత్యాయని యను పరివ్రాజిక వాసవదత్తాహరణమును నాటకముగా వ్రాసి రాణి యెదుట ఆడించుటకు ప్రయత్నించును. ఆసందర్భమున మెల్లగా రాజు, ఆరణ్యకయొక్క చెలియైన మనోరమ సాయముతో

తానే వత్సరాజు వేషముతో వచ్చిన మనోరమవలె రంగము మీఁద నభినయించును. రాణి గుట్టు ఎఱిఁగి ఆరణ్యికను చెఱలో పెట్టించును.

ఇంతకాలమును వాసవదత్తకు తన పినతండ్రి యొక్క స్థితి తెలియదు. ఆమెకు తెలియనీయక వత్సరాజు దాచియుంచి తటాలున దృఢవర్మను విడిపించిన వార్త చెప్పి సంతోషపరుపఁ దలఁచియుండెను. ఇంతలో తనతల్లి అంగారవతీదేవి వ్రాసిన జాబుచేత వాసవదత్త తెలిసికొని దుఃఖపడసాగఁగా వత్సరాజు విజయసేనుని తానుపంపినవార్త చెప్పి సంతోషపరచెను.

విజయసేనుఁడును సరిగా ఆసమయమునకే కళింగుని చంపి దృఢవర్మను విడిపించి వచ్చెను. ఆతనితో కూడ వినయవసువు, దృఢవర్మ పంపున కృతజ్ఞత తెలుఁపుటకు వచ్చెను. అప్పుడే అంతఃపురములో ఆరణ్యిక విషము త్రాగి ప్రాణసంశయ దశకు వచ్చినది. వత్సరాజు విషవైద్యుఁడు గనుక ఆమెను రాణి వత్సరాజుకడకు తెప్పించును. ఆమెను వినయవసువు గుర్తించును. విజయసేనుఁడును సాక్ష్యమిచ్చును. ఆరణ్యికయే ప్రియదర్శిక యనియు, తన పినతల్లికొమార్తెయనియు గ్రహించి వాసవదత్త పూర్వము పినతండ్రి చేసినవాగ్దానము నెఱవేఱునట్లుగా ఆమెను వత్సరాజున కిచ్చి వివాహము చేయించును.

---

# నాటకలక్షణము

మనము మామూలుగా నాటకములని రంగస్థలమందు ఆడునట్టివన్నియు 'నాటకము'లు గావు. వీనికి మనపూర్వులు వేఱువేఱుపేర్లుపెట్టి వానివాని భేదములను జాగ్రత్తగా తెలుపుచుండిరి. ఎట్లనఁగా—రసవంతమైన వాక్యము కావ్యము. అట్టి వాక్యములచేత నొకకావ్యము రచియింపఁబడును. అది వచనమైనను పద్యమయమైనను కావ్యమే. ఈకావ్యములు గద్యపద్యములు కలసినవైనచో చంపువు లందురు. ఇవన్నియు చదివి విని ఆనందింపఁదగియుండుటచేత శ్రవ్యకావ్యములని చెప్పిరి. అట్లు కాక చూడఁదగినకావ్యము లున్నవి. అవే మనము నాటకములనునవి. నాటకములను చదువుటయు వినుటయు మాత్రమే గాక రంగమందు ఆడి చూచి సంతోషించుటవలన వీనిని దృశ్యములనిరి. ఇంకను స్పష్టముగా కొందఱు దృశ్యశ్రవ్యకావ్యమని చెప్పిరి.

దృశ్యకావ్యము అభినయింపఁబడును. రేడియోనాటికలు మనకావ్యములవలె కేవలశ్రవ్యములు. తోలుబొమ్మలాటలు మొదలైనవి వట్టి దృశ్యములు. 'టాకీ'వచ్చుటకు పూర్వముండిన చిత్రములు (Silent Pictures) కూడ దృశ్యమాత్రములే. నేటిచిత్రములును నాటకములును దృశ్యశ్రవ్యములు. నాటకములనన్నిటిని మన పెద్దలు నాటకము లనలేదు; రూపకములు అనిరి. అనఁగా నటులు రామాదుల (వేషములు) రూపములు ధరించి అభినయించుటచేత రూపకములు. రూపకములు పదివిధములు. 1. నాటకము, 2 ప్రకరణము, 3 భాణము, 4 ప్రహసనము, 5 డిమము, 6 వ్యాయోగము 7 సమవకారము, 8 వీథి, 9 అంకము, 10 ఈహామృగము. ఈరూపకములలో ప్రధానలక్షణములోనుండు భేదముతప్ప సామాన్యముగా రచనయంతయు నాటక

ముపలెనే ఉండుటచేత మనవారు రూపకములన్నిటినినాటకము లనియే చెప్పుచున్నారు. నాటకమునే అన్నిలక్షణములతోను కూడియుండి పదియంకములు గలదైనచో పండితులు మహానాటక మనిరి.

ఇవిగాక 'చిన్ననాటకములు' ఉపరూపకములు పదునెనిమిది విధములు. ఇవి నాలుగంకములవి మొదలు ఏకాంకికలవఱకు గలవు అవి_నాటిక, త్రోటకము, గోష్ఠి, సట్టకము, నాట్యరాసకము, ప్రస్థానకము, ఉల్లాప్యము, కావ్యము, ప్రేంఖణము, రాసకము, సంలాపకము, శ్రీగదితము, శిల్పకము, విలాసిక, దుర్మల్లిక, ప్రకరణిక, హల్లీసకము, భాణిక అని. రూపకములకును ఉపరూపకములకును వానివానికి చెప్పఁబడునట్టి విశేషము తప్ప మిగిలిన లక్షణమంతయు నాటకమునకు వలెనే.

అంకము——నాటకమున అంకములు అయిదు మొదలు పదివఱకు నుండును. నాటికలో అంకములు నాలుగు. అంకమనఁగా నాటక విభాగము; అంకములో నాయకుని చరిత్రము ప్రత్యక్షముగా చూపఁబడును. అది అనేకదినములు పట్టునదిగా నుండఁగూడదు. అంకముచివర పాత్రములన్నియు నిష్క్రమింపవలయును. అంకములో ఈ క్రిందిపనులు చేయఁగూడదు. "దూరమునుండి పిలుచుట, చంపుట, యుద్ధము, రాజ్యము దేశములోనగువానికి ఉపద్రవము, పెండ్లి, భోజనము, శాపము, ఉత్సర్జనము, మరణము, రతము, దంతక్షతము నఖక్షతము, ఇట్లు లజ్జాకరములగు నితరదృశ్యములు, శయనించుట, మోవియానుట, (Kissing etc.,) నగరాదులను ముట్టడించుట, స్నానమాడుట, మైపూఁత పూసికొనుట మొదలైనవి. అంకము మిక్కిలి దీర్ఘముగా నుండఁగూడదు.

నాటిక – ప్రియదర్శిక ఉపరూపకములలో మొదటిదైన నాటికలో చేరును. నాటికయందు కథ కల్పితము; స్త్రీపాత్రములు బహుళము; నాలుగంకములు. ప్రసిద్ధుఁడు ధీరలలితుఁడు, రాజు నాయకుఁడు. నాయిక అంతఃపుర సంబంధురాలు, సంగీత వ్యాపారమున నుండునది యొండె, నూతనానురాగ కన్య, మహీనాయక పుత్త్రి. ఈమెను గూడుటకు నాయకుఁడు పట్టపు దేవికి వెఱచియు జతనములు సేయును. దేవి జ్యేష్ఠురాలు, ప్రౌఢ, నరపతిపుత్త్రి, మాటిమాటికి మానము వహించునది. నాయికానాయకుల సంగమము దేవివశములో నుండును. ఇందు కైశికీవృత్తి విమర్శేతర సంధులుండును.

నాంది – నాటకమందు ముందుగా పూర్వరంగము, అటు పిమ్మట సభాపూజ, తర్వాత కవిని పేర్కొనుట, నాటకమును కూడ పేర్కొనుట, తర్వాత ప్రస్తావన. అందు నాట్యవస్తువు కంటె ముందుగా రఘ్నవిఘ్నోపశాంత్యర్థము నటులు కావించు నట్టిది (పూజ) పూర్వరంగమనఁబడును. దీనియంగములలో ముఖ్యమైనది నాంది. ఈనాందియనునది నాటకాదుల యారంభమందు దేవబ్రాహ్మణ రాజప్రభృతులకు స్తుతిగా సామాజికాదులకు ఆశీర్వచన రూపముగా 8, 12, 18, 22 పదములు గలదిగా రచింపఁబడును. ఇందు బిల్వ శంఖ చంద్ర కమల చక్రవాక కుముదాది శుభవస్తువాచకములును కావ్యార్థసూచనయు నుండవలయును. కొందఱి మతంబున పద నియమ కథాంశసూచనలు పాక్షికములు.

ప్రస్తావన – నటియేని విదూషకుఁడేని పారిపార్శ్వకుఁడేనియు సూత్రధారునితో స్వకార్యములంగూర్చి చిత్రవాక్యము

లతో నారంభించి నాట్యవస్తువును ప్రశంసించునట్టి సంభాషణ ఆముఖమనియు ప్రస్తావనయనియు పేర్కొనఁబడును.

వసన్తోత్సవము-నాటకమందు వివాహకథయైనచో వసంతమునేని గ్రీష్మమునేని ప్రస్తావించుట సంప్రదాయము.

నేపథ్యము-అనఁగా తెఱమఱుఁగున నటీనటులు వేషము దాల్చు చోటు.

విష్కంభము-అయినవియు కాఁబోవునవియునగు కథాంశములను సంగ్రహముగా తెలుపునది విష్కంభము,-అంకమునకు పూర్వము నిబంధింపఁబడును. మధ్యపాత్రముచేత గాని, మధ్యపాత్రములచేత గాని ప్రయోగింపఁబడునది శుద్ధవిష్కంభము; నీచమధ్యపాత్రములచేత ప్రయోగింపఁబడునది మిశ్రవిష్కంభము.

విదూషకుఁడు నాయకునికి శృంగారసహాయుఁడు, బ్రాహ్మణుఁడు, కుసుమవసంతాది నామధేయుఁడు, క్రియా శరీర వేష భాషాదులచేత హాస్యముపుట్టించువాఁడు, జగడగొండి, తన పనిలో నేర్పరి.

కంచుకి-అంతఃపురమందుండు నధికారి, బ్రాహ్మణుఁడు, గుణవంతుఁడు, సర్వకార్యార్థకుశలుఁడు.

ప్రవేశకము-నీచపాత్రములచేనీచవాక్యములచే చేయఁబడును. రెండంకముల నడుమ వచ్చును. మిగిలిన విషయములలో విష్కంభమువలె.

భరతవాక్యము-భరతుఁడు, అనఁగా నటుఁడు చెప్పునట్టి వాక్యము.

---

చంద్రికాప్రెస్సు, మదరాసు.—2-8-1954.

రు. అ.

పద్యకథాలహరి, ప్రాచీన గ్రంథములనుండి సంగ్రహింపఁబడిన చిన్నపద్యకథలు. ... 0 12

## నాటకములు

| | రు. | అ. | | రు. | అ. |
|---|---|---|---|---|---|
| ప్రతాపరుద్రీయ నాటకము | 3 | 0 | బొబ్బిలి యుద్ధనాటకము | 2 | 8 |
| ఉషానాటకము | 1 | 8 | ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము | 1 | 8 |
| విక్రమోర్వశీయ నాటకము | 2 | 0 | మాళవికాగ్నిమిత్ర నాటకము | 0 | 12 |
| ప్రియదర్శికా నాటిక | 0 | 12 | శ్రీకృష్ణరాయవిజయ నాటకము | 0 | 8 |

రత్నావళి నాటిక, శ్రీధరణికోట వేంకటసుబ్బయ్యగారి వ్యాఖ్యతో 1 8

ఉత్తరరామచరిత్ర నాటకము, శాస్త్రిగారి పీఠికతో ... అచ్చులో

## కథలు-సులభవచనగ్రంథములు. (నాండీబెయిల్డు)

భోజకాళిదాసకథలు అప్రూవ్డు iii, iv ఫారములకు ... 0 12

విక్రమార్కుని యద్భుతకథలు ,, iv, v ఫారములకు ... 0 12

ఉదయనచరిత్రము ,, డిటో ... 0 12

బేతాళపంచవింశతిక ... 0 12

ఆంధ్రహితోపదేశచంపువు ... 1 8

కథాసరిత్సాగరము 6 భాగములు ... 15 0

,, ఒక్కొక్క భాగము ప్రత్యేకముగా ... 2 8

## లక్షణగ్రంథములు

ఆంధ్రసాహిత్యదర్పణము, ఉదాహరణశ్లోకములతో క్రొత్తయచ్చు 6 0

కావ్యాలంకారచూడామణి, 9 ఉల్లాసములు పూర్తి ... 1 8

అలంకార సారసంగ్రహము, సటీకాతాత్పర్యము ... 0 12

ఛందస్సు, సులువు, సంగ్రహము ... 0 4

శాస్త్రిగారి విమర్శలు - ఉపన్యాసములు రు. అ.

గ్రామ్యభాషాప్రయోగనిబంధనము, నాటకముల పాత్రోచితభాషను గురించినది ... 0 12

ఆంధ్రవ్యాకరణ సర్వస్వతత్త్వము ... 1 0

విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్యములను గురించినది 0 12

తిక్కనసోమయాజి విజయము, జీవితచరిత్ర విమర్శ ... 0 8

భారతాభారత రూపకమర్యాదలు (ఇందు నాటకశైలి-దాని చరిత్రము, లక్షణము మొదలైన విషయములు గలవు) ... 0 6

ఆంధ్రగ్రంథ విమర్శన ప్రకార లేశము ... 0 6

గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్య గ్రాంథిక వాదములను గురించినది. అన్నిజిల్లాల వ్యావహారిక భాషలను వర్ణించియున్నారు. కడుపుబ్బ నవ్వించు విమర్శ ... 0 6

విసంధివివేకము ... 0 2

స్త్రీ పునర్వివాహగ్రంథము ... 1 0

ఆంధ్రభాషాసర్వస్వార్హనియమకతిపయములు (నిఘంటురచనావిధి) 0 4

---

చరిత్రరచన (మొదలైన చారిత్రకవ్యాసములు) ప్రథమభాగము, ఆంధ్రులు, పల్లవులు, చాళుక్యులు, చోళులు మొదలైనవారి చరిత్రములు చక్కఁగా వివరింపఁబడియున్నది. యూనివర్సిటీ విద్యార్థులకుపయోగకరము. నేలటూరి వెంకటరమణయ్యగారిది ... 2 0

మధుమావతి మొదలైనకథలు నాలుగుకథలు చరిత్రాత్మకములు గలవు. 1. మధుమావతి ప్రతాపరుద్రుని వేశ్యయైన మాచల్దేవి చెలికత్తె, ఓరుగంటి ముట్టడిలో నీమె తురకలకు పట్టుబడిచేసిన చమత్కారకథ 2. ప్రతీకారము, మధురను పాలించిన సుల్తాను హిందూస్త్రీని చెఱపట్టగా నామె కసిదీర్చుకొనిన కథ, 3. కంపిలిరాయలు, విజయనగర సామ్రాజ్యస్థాపనమునకు పూర్వము కంపిలిరాజ్యమును తురకలు కూల్చిన కథ. 4. ఛత్రగ్రాహి, కృష్ణదేవరాయలగొడుగు మోపరి, పోలఁడు, ఒకదినము రాయసింహాసన మెక్కిన విచిత్రకథ. నేలటూరు వెంకటరమయ్యగారిది 2 0

రు. అ.

By Dr. N. Venkataramanayya, M.A., Ph D.

*Kampili & Vijayanagara* 2 0

*Eastern Chalukyas of Vengi* 15 0

శ్రీ ప్రొఫెసర్ T. M. శేషగిరిశాస్త్రిగారి గ్రంథములు

ఆంధ్రశబ్దతత్త్వము TELUGU PHILOLOGY. ఇందు ఆంధ్రవ్యాకరణము సంపూర్ణముగా కలదు. అరవము, కన్నడము, మలయాళము మున్నగుభాషలతో తెనుఁగునకుగల సంబంధము చక్కఁగ వివరింపఁబడియున్నది. తెలుఁగు ఫైలాలజీవిద్యార్థుల కుపయోగకరము. 2 భాగములు ... 8 0

అర్ధానుస్వార తత్త్వము, పైదాని కనుబంధము ... 0 8

*Notes on Aryan & Dravidian Philology* by the late Professor T. M. Seshagiri Sastriar. Old Copy Reduced Price 2 0

వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము— 25 ప్రకరణములు. సులువైనశైలి. శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలిక పండితవిమర్శలు మొదలైన యనేకవిశేషములు గలవు. శ్రీ డాక్టరు, సర్, కట్టమంచి రామలింగారెడ్డిగారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము. కర్త : శాస్త్రిమనుమఁడు. 2 0

*A Hand-book of Classical Samskrit Literature* for College Students, with questions and a Chronological Chart by U. Venkatakrishna Rao, M. A. 2 0

*Notes on the Study of the Preliminary Chapters of the Mahabharata* by Vedam Venkatachellam Garu B.A., B. L. 5 0

శ్రీ ... శాస్త్రి గారు ఆంగ్లంలోనూ ఆంధ్రంలోనూ పండితులూ, కవులున్నూ. వీరు నాటకాలు వ్రాయడంతో తృప్తిపడకుండా - వాటిని ప్రదర్శించి, రక్తి కట్టించిన నటకులు, నాటక కళాభిజ్ఞులు. ఇట్టివారి రచన ప్రదర్శనానికి చాలా అనుకూలంగా ఉంటుందని వేరే చెప్ప నక్కరలేదు.

బులుసు వేంకటరమణయ్య.

(2) "వినుగు రహితం
వినోద సహితం
విజ్ఞాన మహితం, ఈ నాటకం
సర్వదేశ సర్వకాల ప్రశస్తి నందును గాక."

నేలటూరు భక్తవత్సలయ్యంగారు M. A, B. O. L.

ఆంధ్రాధ్యాపకులు, వివేకానంద కళాశాల, మద్రాసు.

(3) ఆంధ్రప్రభ. 11-9-1952 ఆదివారము.

ఇందలి కథావస్తువు...సంభాషణలు నడపడంలో రచయిత చాతుర్యంవల్ల ఎక్కడికక్కడ మంచి పట్టుగా ఉంటుంది. ప్రదర్శన యోగ్యములైన సాంఘిక వినోదనాటకాలలో ఇదికూడ ఒకటి అని చెప్పడానికి సందేహం అక్కరలేదు—భానుజీ.

(4) జమీన్ రైతు 21-11-52

...పాత్రనిర్వహణంలో ఔచిత్యం బాగాపాటించబడింది. కథాగమనంలోగూడా సాఫీగావుండి. ఆతురత (suspense) కలిగించేదిగా ఉన్నది. సంభాషణములలో పాత్రోచిత భావమైన శిష్టవ్యావహారికం వాడబడింది. రచయిత తనతాతగారు పూజ్యపాదులు కళాప్రపూర్ణ శాస్త్రిగారి సిద్ధాంతాన్ని అనుసరించారు.

...తగినంతపాళ్లలో హాస్యరసంకూడా పోషింపబడినందువల్ల ఈ నాటకాన్ని ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులు ఆనందిస్తారని చెప్పటానికి ఏలాటి సంకోచం అవసరంలేదు.

Research Scholar గా ప్రసిద్ధివహించినా నాటికా కర్తగా కూడా కృతకృత్యులైనారనే చెప్పాలి.

కే. పి. నారాయణరావు, బి. ఎ. బి. ఎల్.

*5. Indian Express 21-9-'52*

This is a social play with a well-known theme. The hero of the play who is an educated youth dislikes his wife whom he married when both of them were pretty young, on the pretext that she is illiterate and does not measure upto his standards of 'civilisation' and 'social graces'. All efforts at amicable settlement fail, while Parijatam an educated friend of the victim Susila evolves a stratagem. She makes Susila to put on the role of a highly educated society Lady. The unsuspecting husband without knowing it makes love to the 'lady' and finally marries her only to discover to his horror, which later turns to pleasure that it was his own old wife.

The theme is as old as the hills but its dramatisation is very interesting not only to read but also to put on boards with its lively conversation and well-kept up continuity and suspense.

—*Bhanuji.*

*6. The Madras Mail.*

This is a short social play in Chaste prose in Telugu...... Though the theme is a simple one the play is enjoyable; it depicts the trials, the sorrows and joys of Hindu social life.

*7. Prof: G. V. Subbaramayya, M. A., L. T.,*
*Head of the Dept. of English, V. R. College, Nellore.*

It is an exquisite satire on the fashionable young gents of the present day. The plot is well constructed and characterisation is simple and clear. The dialogue is noteworthy in one respect. Just as your grand-father of Immortal memory specialised and excelled in the Muslim colloquial Telugu, you have experimented in the colloquial Telugu of the English - educated with success. Your tamilised Madras Telugu is also quite appreciable. I particularly appreciate your reference to proffessors, who resort to manuscript eloquence. I wish you more and greater success in works on the same line,

*8. Sri. N. Venkata Rao, M. A.*
*Head of the Dept. of Telugu, Madras University.*

It is really an excellent piece of Dramatic art. It is far above the level of the innumerable social plays now current and I read the work with great pleasure. I am exceedingly glad that you are both a finished actor and a creative artist. I wish to see that the play is enacted once as I do not know whether it is enacted before.

I appreciate very much the psychological treatment and the characterisation of the play as well as the language with a sprinkling of good humour. I hope you will produce more workss ofthis nature in future and maintain the tradition of you rgrand-father, the most original creative Dramatist of modern times.

*9, The Hindu, 16-11-'52.*

This is a social play written on a modern theme with an ultra-modern youth, Kutumbarao, as the hero,and his orthodox wife Susila as the heroine. The English-educated Kutumba Rao has a glamour for western fashions and disregards his wife, who is a faithful and devoted woman. Mias Parijatam, a social welfare worker, intervenes and changes the old fashioned Susila into a modernist. The plot is woven so dexterously that Kutumba Rao is unaware of this fact till the end. The hero falls in love with the newly fashioned Susila, thinking that she is a different lady, and marries her. It is only in the end that he realises that he has remarried Susila, whom he had ignored. The style is unaffected and natural and the situations are quite dramatic. The author has inherited the dramatic geuius of his grandfather the late *Venkataraya Sastrulu* one of the most original creative dramatic artists of modern times. He is to be congratulated on his excellent production.

**Vedam Venkataraya Sastry & Bros,**

*4, Mallikeswarar Koil South Lane,*
*Linghi Chetty Street, G. T. Madras*